# వేశ్యామ[illegible]ము

[మొదటి భాగము.]

ఇది

సుశీల, పరశురామవిజయము, మహాభారతసారము, [illegible]చరిత్ర, ప్రమీలార్జునము, భాగవతసారము, విష్ణుపురాణము, ప్ర[illegible]దము, విజయబొబ్బిలి, ఉషాపరిణయము, రామాయణ సారము, భారతవీరులు, సారంగధర, ప్రహ్లాద చరిత్రము, అభినవరాఘునము, గయో పాఖ్యానము రచించిన

శ్రీయుత ద్రోణంరాజు సీతారామారావుగారిచే

రచింపఁబడి

భీమవరోలు బుక్కుసెల్లర్

## కురుకూరి సుబ్బారావుచే

ప్రకటింపఁబడియె.

రెండవకూర్పు 1000 ప్రతులు



కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాల స్ముద్రితము.

1922.

కాపీరైట్ రిజస్టర్డు.]

[వెల రు 1—0—0.

ANDHRA ... ఆంధ్ర ... భాషానిలయము హైదరాబాదు ... [illegible]PALLY, HYD.

గుఱ్ఱము జగన్నాథం, [illegible]

# ఇందువచ్చు పాత్రలు.

పురుషులు.

వెంకటేశ్వరరావు—మోహినికి విటుడు.

కొండయ్యనాయుడు—వైద్యుడు—మోహిని సరసుడు.

జంగం నాగలింగం—
కంసాలి వీరయ్య—
రామానుజాచారి—
రామన్న పంతులు—
చినరాజు శెట్టి—
సుబ్బరామయ్య—
} మోహిని సరసులు.

నరసింహం—మోహినికి మొదట కన్నెఱికము చేసిన సరసుడు

ముకుందరావు—పోలీసు యినస్పెక్టరు.

ఇబ్రహీం—పోలీసుజవాను.

వెంకటాచార్యులు—బాటసారి.

స్త్రీలు.

మీనాక్షి—వృద్ధవేశ్య.

మోహిని—మీనాక్షికూతురు.

తిరువెంగళమ్మ—వైష్ణవచిన్నది.

పిచ్చి—ఒకతార్పులాడి.



# వేశ్యామధురము.

## మొదటి భాగము.

రంగము.

[వంతెనయొద్ద వెంకటేశ్వరరావు ప్రవేశము.]

వెంక—(తనలో) ఆహాహా! ఏమి, ఆముఖముయొక్క సౌందర్యము. ఆమోహినిని వర్ణించుటకు పదములే చాలకున్నవి. నిజముగా బ్రహ్మదేవు డీమెనుజూచియే చంద్రుని బుట్టించినాడు. లేక పోతే యింతయందము! చందము! ఉండునా? దానిపేరు తలచుకొంటే నావళ్ళు జల్లుమనుచున్నది. దాని ప్రతిబింబము నాకన్నులకు గట్టినట్లే యున్నది.

చ. నిలచినం గూరుచున్న, శయ ♦ నించిన, మేల్కనియున్న నన్యులన్
గలసి చరించుచుండిన నె ♦ కండనెయుండినన్, నెద్దియేనియున్
సలుపుచునున్న, మానినను; ♦ జక్కదనంబుల కిక్కయైనయా
కలికి మనోహరాకృతులె ♦ కన్నులం గట్టినయట్లు గన్పడున్.

ఇంతయెందుకు? అంత నిండైన మనిషి, అంతనాజూకు గల దానిని నేనెందును జూచియుండలేదు. తక్కిన వేశ్యకాంతల నందరిని దీనిమీదనుంచి దిగదుడిచి వేయుటకైనను బనికిరారు. (ఇంచుకయూరకుండి) ఏమైతేఅయింది. మాతండ్రి తాతలు శవాలుమోసి, సపిండీకరణాలకు వెళ్ళి, శ్రాద్ధములుచేయించి చాలాధనము సంపాదించి

ఇక్కడకువచ్చి కనిపెట్టుకుని వుండమన్నది. ఇంకారాలేదు. (ఎదుటం జూచి) అదుగో, అనుకున్నంతలోనే వచ్చింది. ఆహా! దీనిమొఖం చూచేటప్పటికే నాకు నిండాసంతోషము కలుగుతూవున్నది. ఓమనస్సా! తొందరపడకుము.

తే. గీ. అరుగుదెంచుచు నున్నది యదిగొ దాసి
వచ్చియో, పండొ యిప్పుడే పలుకఁగలదు
ఆకసమువంకఁ జూచుచు నట్లెనిలుచు
చాతకము నోటిలోన వర్షంబొ; పిడుగొ
పడెడుచందాన నీకింక మానసంబ.

[అంత పిచ్చి ప్రవేశించుచున్నది.]

పిచ్చి—(తనలో) నేననుకొన్నట్లు మునుగానే వచ్చి యిక్కడ నాకోసం కనిపెట్టుకొనియున్నాడు. ఈసమయంలో నేనువీడిని వదలిపెట్టకూడదు. ఏం నాదేంపోయింది నేను నెమ్మదిగా యీపంతులుతో మోహిని యింకా వప్పుకోలేదనిన్నీ, అది వొప్పుకొన్నా, తల్లి గుఱ్ఱపుబండి దిగకుండావుందనిన్నీ, చెప్పి వీడిదగ్గర డబ్బు లాగవలయును. ఇంక మీనాక్షితో "వెంకటేశ్వరరావంతటి భాగ్యవంతుఁడు లేడు కాపున నాతని నెట్లయిన నీవశము జేయుదునని చెప్పి దానిదగ్గర బేరుకొనవలయును. (ప్రకాశముగా) ఏమండోయి, వెంకటేశ్వరావుగారు. ఈవాళ ఎక్కడా దర్శనమేయిచ్చారుకారు. నామీద దయతప్పినట్లున్నది పోనియ్యండి. ఏంచేస్తాను.

వెంక—పిచ్చీ! ఈరోజున కొత్తమోస్తరుగా మాట్లాడుతున్నావేమి? క్రొత్తచీర గట్టుకొంటివననియా? ఓహో నాయుడుయిచ్చినాడు కాబోలు!

పిచ్చి—సరిలేవయ్యా! ఏంమాటలు. మళ్లీ పెద్దమనుష్యులు. అన్న

దల్లాఅనిపించుకోడానికే. నీసంగతినాకంతా తెలిసినది. అందుక నేనీవు నన్నుగూడా దగాచేస్తావని నీవిషయమై యేమీాప్రియత్నంచేయక యూరకున్నాను.

వెంక—ఏమేవు. నాసంగతి యేమి తెలిసింది?

పిచ్చి—ఏమి తెలిసిందా. మొన్న నీవు కంపెనీకి వెళ్ళినప్పుడావూళ్ళో యేమిచేసినావు?

వెంక—(తనలో) అన్నా! శేషాచలముదగ్గరకు వెళ్లి డబ్బుఋవ్వకుండాపాటిపోయిరాగా, అది నాకుచ్చెళ్ళలో చేయివేసి నాటకంపాకకు వచ్చేదారిలో నిలబెట్టి పరాభవం చేసినసంగతి యీముండ విందా ఏమిటి? దీనిసంగతిచూాస్తే అలాగేవున్నది. (ప్రకాశముగా) ఏంచేశాను?

పిచ్చి—శేషాచలానికి డబ్బియ్యకుండా రావడం.

వెంక—పోవే టప్పాస్. దీనికేంగాని నాకార్యం పండా పచ్చా.

పిచ్చి—మోహినిని నీకుగూర్చుట కాదుగాని నాయెముకలు చూర్ణమైపోవుచున్నవి. మోహిని వప్పుకుంటే ముసలిముండ మీానాక్షి వప్పుకోదు. అదివప్పుకుంటే ఇదివప్పుకోదు. ఏంచెయ్యాను.

వెంక—మోహిని వప్పుకుందా—?

పిచ్చి—మోహిని వకమోస్తరుగా వప్పుకుందిగాని ముసలిదానికన్ను మాత్రం యింకెవ్వరిమీాదనోయున్నది. అది డబ్బాస.

వెంక—కావలసినడబ్బు మనము పారవేతాము.

పిచ్చి—మీాపెద్దలు కష్టపడిసంపాదించినడబ్బు అనవసరముగా ఖర్చుపెట్టడం నాకిష్టములేక చూచుచున్నాను. దానిదాహము మనము తీర్చగలమా?

వెంక—నీవావిషయమై ఆలోచించనక్కఱలేదు. ప్రస్తుతము ఈవందరూపాయలు తీసికొనిపోయి యీాముసలిదానిచేతిలో బెట్టికార్య

సాధనం చెయ్యి. ఇంక నాకు పొద్దుపోయింది. నేనేగెదను. మళ్లీ రేపు కలుసుకొందాము. (నిష్క్రమించును)

పిచ్చి—శహ బాష్ యిప్పుడు నందరూపాయలు చేతిలోఁబడినవిగదా. (ఎదుటజూచి) అదుగో బాతాఖానీల సుబ్బరామయ్యగారు వస్తున్నారు.

సుబ్బ—ఏంపిచ్చీ? ఇక్కడా అక్కడా తిరుగుచున్నావే! ఈవాళభోజనం చెయ్యడాని కెవ్వరూ దొరక లేదా యేమిటి?

పిచ్చి—ఆగోల నీకెందుకయ్యా. నీదారిని నీవు పోవక.

సుబ్బ—మాటమాట. కోపపడకు.

పిచ్చి—నాతో నేమిమాటలున్నాయి. సమయముకానప్పుడుసరసాలట.

సుబ్బ—నీతోనా కేంసరసాలు, వూళ్లోవాళ్ళంత నిన్ను తనుభార్యలకంటె నెక్కువగా జూచుకొంటారు. ఈమాటల కేంగాని, మోహిని కన్నెరిక మెవ్వరుపెట్టుటకు నిశ్చయించినారో నీకు దెలుసునా.

పిచ్చి—నీకాసంగతి యెందుకయ్యా. నీకు కావలసినది వుందా యేమన్నానా. అట్లాకోరికవుంటేఒక వెయ్యిరూపాయలుపట్టుకొనిరా.

సుబ్బ—వెధనరూపాయల కేం. ఇదిగో వడ్లకుప్పలు కొట్టించాం. దస్తు కొద్దిరోజులలోనే వస్తుంది. నీవిషయం నేను మఱచిపోనుగాని మోహినితో కొద్దిగా, "బాగా పాడుతాడనియు, మంచి జనపాలుండు" ననియు సిఫార్సుచేయుదూ.

పిచ్చి—మీ పినతండ్రిగారు ముట్టెత్తుకుంటారనియు, మీరు వాచిలేని గొలుసు తగిలించుకుంటారనికూడా చెప్పమన్నారా. (నవ్వుతూ నిష్క్రమించును.)

సుబ్బ—(తనలో) డబ్బుఖర్చు లేనిఉపాయ మేదియైనావుంటే చూడవలయును. (నిష్క్రమించును.)

రంగము.

[మందిరంబున నొంటిగా మోహిని ప్రవేశించుచున్నది.]

మోహి—(తనలో) అయ్యో దైవమా !

తే. గీ. పడుపుచేతను గాలంబు ǀ గడపుమనుచు
మూడుబంతులుగా వ్రాసి ǀ మోముపైన
వేశ్యకులమున సృష్టించి ǀ వెలసినావె
ధాత ! పనిలేదె నీకును ǀ భూతలమున.

నీచర్యలన్నియును జంత్రిబులుగదా ! ఈ వేశ్యకులమును సృష్టించుటచే భూమిపై నెన్నియనర్థకంబులు సంభవించుచున్నవో యెఱుఁగలేకపోయియుంటివా? ఎఱుఁగకేమి! సమస్తమును నెఱిఁగియుండియు నిట్లుచేయుచుంటివి. (యించుక యూరకుండి) అక్కటా! ఈ వేశ్యకులమునఁ బుట్టడముకంటెఁ గడునీచజాతియగు ఛండాలకులంబున జనించుటయే మంచిదికదా ! (తల్లిదండ్రుల నుద్దేశించి) తల్లిదండ్రులారా! నేను మీగర్భమున నేలపుట్టితిని ? మీరు నన్ను బోషింపలేకపోయినచో నొక్కసారి గొంతుకనొక్కివేసి చంపివేసినను బాగుండునుగదా! అట్లుచేయక యెప్పుడుపాపములతోఁ గూడియుండు భోగముజాతికి నన్నేల యమ్మివేసినారు ? ఇంతమాత్రముచేత బ్రతికియున్న నాల్గురోజులు మీకు పొట్టనిండునని చూచినారా ! అయ్యయ్యో ! నన్ను నిష్కారణము గొంతు నొక్కితిరే.

తే. గీ. అక్కటా! యెట్టివంశంబు ǀ నందు జన్మ
మందితిని దాని నెఱుఁగంగ ǀ నైతిఁగాని
వేశ్యజాతికి నన్నమ్మి ǀ వెలసినారె
వరగులాబిని డొంకలో ǀ వదులుపగిది.

కఠినాత్ములగు తల్లిదండ్రులారా! ఆఁడుపిల్లల నమ్ముకొని కాలం బుగడపనెంచి యింకను నాతోఁబుట్టువుల నెందఱినెందఱికమ్మినారోకదా

తే. గీ. ఇపుడు పుత్రికలను విక్ర । యించినాము
ధనము దొరకెనటంచు సం । తసమెకాని
యముఁడు మిము రేపు దండించు । నప్పుడిందు
కేమియుత్తరం బిత్తురో । యెఱుఁగరాదు.

మిమ్ము నిశ్చయముగాఁ గిరాతులని పిలువవలెను. (ఇంచుక యూరకుండి) అయ్యో! ఏమిది నేను వెఱ్ఱిలోఁ పడిపోయి తల్లిదండ్రులను దూషించుచున్నాను.

తే. గీ. తల్లిదండ్రుల దూషింపఁ । దలఁపనేల
వేశ్యకాంతల పొత్తున । వెలయుమంచు
భారతీశుఁడు నానొస్ట । వ్రాసియుండ
నతనివ్రాఁతను దాఁటంగ । నగునెనాకు.

సరే గతజలసేతుబంధమునకు విచారించినమాత్రము ప్రయోజనం బేమున్నది! నాపూర్వకర్మంబుకొద్ది యిట్లయినది. (ఇంచుక యూరకుండి) ఆహా! ఈవేళ యెంతయు పాడురోజు.

తే. గీ. నేను జదివినవిద్యల । నెల్ల నేఁడు
పడుపుఁదనమున వినియోగ । పఱుపవలసెఁ
గా యటంచును నెంతొ దుః । ఖంబు పొంగి
పొరలివచ్చుచునున్నది । ధరణియందు.

తే. గీ. సత్కులాంగనల్ పఠియింపఁ । జాలినట్టి
విద్యలన్నియును జదివి । వెలసినాను
ఎంతయున్నఁ బ్రయోజన । మేమికలదు
అడవిఁ గాచినవెన్నెల । వడువుగాదె.

చిన్నప్పుడు నేను బడిలోఁచదువుకొనునప్పుడు తోడిబాలికలందఱును నన్నుఁజూచి నీవు బోగముదానివని నిందించుచుండ నేనువారితో సఖులారా! నేను సామాన్యముగా నందఱిమోస్తరుగా నుందునని తలంచినారాయేమి? అట్లుకాదు. నేనుగూడ నెట్లయిన కష్టపడి మీకు వలె పెండ్లిఁజేసికొని కులకాంతనై యుందునని చెప్పుచువచ్చితి. ఇప్పుడామాటను మఱచిపోయి మాయమ్మ నన్ను బ్రవేశపెట్టుచున్న వృత్తికి నేనెట్లొప్పుకొనఁగలను? మొదటికన్నెఱిక మీయూరఁగాక మరొకయూరనగుటచేత నెవరికిఁదెలియదు. అప్పుడే నేను వ్యభిచారము నాకు 'మొర్రో వద్దర్రా' అంటే ముసలమ్మలు నాకు నాల్గు రోజులు తిండిపెట్టకుండా కట్టిపడవేసినారు. ఈసారిగూడా ఆలాచేస్తినా గొంతుక్కాయ పిసికివేస్తారు. లేదా ఒంటినిండా వాతలన్నా వేసి ఒప్పుకునేటట్టు చేస్తారు. ఆమధ్య బందరులో అత్తగారు, మామగారు, మొగుడు కలిసి ఒకకోమటిపిల్లకు యేదోమాట వింది కాదని వాతవేశారట. కేసుగూడా అయింది. అట్లాగే నాకూచేస్తారు, అయిననూ నూరునోములూ ఒకరంకుతో సరిఅన్నట్లు ఒకసారి కన్నెఱికమయిన తరువాత యిప్పుడు పెళ్ళిప్రయత్న మేమిటి? ఇపుడు నాకు కన్నెఱికము బెట్టి నన్నుంచుకోడానికి యువ్విళ్ళూరుచున్న వెంకటేశ్వరరావుపంతులు సంగతి చూదామంటే డబ్బుకేం లే? తండ్రి శవాలుమోసి తెచ్చిందిచాలావుంది. కాని చదువుసంధ్యలుమాత్రము భూగోళము. అందముచూతామంటే యెత్తుతో లేగాని, నడుచునప్పుడు ధోవతిచెంగు చేతితో పట్టుకోవడం, పక్షవాతంవచ్చినవాడికిమల్లే యేకాలో, చెయ్యో, అస్తమానం ఆడిస్తుండడం, పెదవులు విరుస్తుండడం మొదలగు అన్ని అవకతవక చర్య లున్నాయి. అదేంనవ్వోగాని నవ్వితే కళ్ళు మూసుకొనిపోతాయి అయినను ఇదియంతయునా కేమి.

సీ. నిన్ను వర్ణింపఁగా ౯ నేఁ జాలనంచును
నొప్పుగా జిత్తంబు ౯ నుబ్బఁజేసి
నిన్ను బాసితినేని ౯ నిమిషమైనను కోర్వ
నంచుఁ బల్మారు న ౯ మ్మించిపలికి
యీశరీరము మీది ౯ యే యని పలుకుచు
మదిని సంతతము న ౯ మ్మకము జెప్పి
యాత్మలోపలలేని ౯ యనురాగమెంతైన
పైకిఁ జూపించుచుఁ ౯ బరఁగుచుండి
తే. గీ. మాయలును మందులునుగాక ౯ మఱియుఁబెక్కు
కల్లకపటంబు లెప్పుడు ౯ గొల్లలుగను
జూపి, యీవెంకటేశుని ౯ జోగిజేతు
తోడివేశ్యలు జూచి సం ౯ తోషమొంద.

కానిమ్మా. ఇట్లనే పదిమందిదగ్గఱ బాగుగ రెండేండ్లలో నార్జించి తరువాత హాయిగా కాలిమీద కాలు వేసికొని కూర్చుంటాను. అదుగో. మాయమ్మ వచ్చుచున్నది.

[అంత మీనాక్షి ప్రవేశము]

మీనా—ఏమే! మోహినీ! ఇంకా తెల్లమొఖం వేసుకొని కూర్చున్నావు. ఏసంధుపాళీఅయినా చూచుకొని యెక్కడికయినా పాఱిపోయి పెండ్లి చేసుకుందామని చూస్తున్నావా యేమిటి? ఆలాచేస్తే ఇక అడుక్కుతినడమే.

తే. గీ. అంచితంబైనముదమున ౯ బెంచుకొంటి
నీవు బాగుండచూడగా ౯ నెంచియుంటి
నాదుకోర్కెల నెఱవేర్చి ౯ నన్ను సంత
సాబ్ధి దేలింపగా బ్రితి ౯ మాలుకొంటి.

అమ్మా! నీవు మంచియైశ్వర్యంతో తులతూగుతూవుంటే చూడాలని నాకు నిండా కోరికగావున్నది. అందుచేత యీలా చెప్పుతూవున్నాను. తోడివాళ్ళనుచూడు. చంద్రరేఖ తన్నుంచుకొన్నాయనను తన వలలో వేసికొని మేడ గట్టించినది. నీలవేణినిచూచినావు. కంటె, వడ్డాణం, నాను, గజ్జెలపట్టెడ మొదలగునవి పెట్టుకొని కులుకుతూవుంది. నీవుకూడా వాళ్ళనుమించి, యెప్పుడువుంటావో ఆరోజులు యెప్పుడు వస్తాయో అని కనిపెట్టుకొనివున్నాను. అందుకు తగినట్లుగానే వెంకటేశ్వరావుపంతులు నీకు కన్నెఱికము చేసి నూటపదార్లు కట్నం యిస్తాననిన్ని, తరువాత నెలవకటింటికి ముప్పైరూపాయలు యిస్తాననిన్ని వార్తలు పంపగాపంపగా యిప్పటికి నేను అందుకు సమ్మతించినాను. ఆయనయైనను మంచి సరసుడుగాని సామాన్యుడు కాడు. ఒకవేళ విశేషము అందమైనవాడు కాడనుకో. ఈకాస్త అడ్డు తీరినతరువాత నీకెవరిపై మోజువుంటే వారిని వేంకటేశ్వరావు రాని వేళలో రానియ్యవచ్చును. అట్టిసంగతులు నీకుతరువాత చెప్పుతానులే అది కడురహాస్యం. మళ్ళీ అల్లరిసాలవకూడదు. ఇంకనీవు ఆకబురులు యీకబురులూ చెప్పుతూ కాలముగడపక ముస్తాబైయుండు. వెంకటేశ్వరరావుపంతులు వచ్చేవేళ అయింది.

**మోహి.**—ముస్తాబవు షోకుగావుండు అని చెప్పుతావు. ఏమున్నది. నాపిండాకుడు. కట్టుకోడానికి మంచిచీరవున్నదా? పెట్టుకోడానికి మంచినగవుందా?

**నా.**—అమ్మో. చీరకేమే. మీపెద్దక్కయ్య జరీగళ్ళచీరె నిన్ను కట్టుకోమంది. కాసులపేరున్నూ, కంటెనూ, వీరయశెట్టి వూళ్ళో లేకపోవుటచేత భార్యనడిగి యెరువు తెచ్చినాను. పాపము జ్వరములోవుండికూడా ఆవిడయిచ్చింది. ఆయన వచ్చేలోపుగా పెద్దజ్వరంవచ్చి చచ్చిందా? అది మనకేదక్కుతుంది!

మోహి—అమ్మా! అంతమాటెందుకులే.

[తలుపుచప్పుడు వినబడును]

మోహి—యెవరువారు?

మీనా—యెవరంటా వేమిటి. వెంకటేశ్వరావుపంతులుగారు (నిష్క్ర మించి వెంటనే వెంకటేశ్వరావుతో ప్రవేశించును)

వెంక—(తనలో) ఆహా! నాకోరిక యిప్పటికి ఫలించినది. ఇంత కష్టపడితేనేగాని నాకిది లభించిందికాదు. దేవలోకంలో ఊర్వశి రంభ మొదలైనవా రుంటారంటారుగాని దీనికి వారు సహస్రాంశమైనను బోలరు. దీనిమొఖంతో సరిపోల్చడానికి యితర వస్తువు కానిపించడంలేదు. కావున దీనికిదియే సాటియని చెప్ప వచ్చును.

తే. గీ. భూరికాననభూముల ఘోరమైన
తపము జేసికొనుచునుండు తపసులైన
నింతిఁ జూచినయంతనే యెంతయైన
సేవ సలుపంగనెంచరే చిత్తమందు.

నాబోటివాళ్ళకు మనస్సు ఆగుతుందా.

తే. గీ. కచ్చడములు గట్టినముని ముచ్చులెల్ల
వారవనితల యిండ్ల సేవకు లటంచు
సంతసముబూని జగమున సకలజనులు
పలుకుచుండినవాక్య మబద్ధమగునె.

ఈవాళ నాకెంతయు సుదినము. లోకములో గొడ్డుబోతుకు బిడ్డపుట్టితే యెంతసంతోషం వుంటుందో అంతకు పదివేలరెట్లు సంతోషం నాకు వున్నది. ఇంక నేను దీనిని ఫలకరించిచూచెదను. (సమీపించుచున్నాడు.)

మోహి.—(లేచి) పంతులుగారూ ! ఇటుదయచేయండీ. సేవకురాలు నమస్కరించుచున్నది.

వెంక—మోహినీ ! నీవుకూడా యిల్లాకూర్చో.

మోహి.—మాయింట్లో మేము కూర్చోడానికేం లెండి. తమబోటి గొప్పవారు మాయింటికి వచ్చునప్పుడె మర్యాద చేయవలయును గదా. (కూర్చుని) ఇప్పటికి మోహినిమీద దయవచ్చిందికదా. మీముఖం యిదివరలో చూతామంటే కనబడకపోయింది. పోనియ్యండి ఇప్పటికైనను వచ్చినారు. మీరు మాయింటి కెందుకు వస్తారు.

తే. గీ. భళిర, దివ్యమాగంగాపు ౹ వాహ మెలమి
చాటిసేలపైఁ బారెను ౹ చందమునను
వచ్చినారలు మీరు నా ౹ భవనమునకు,
మదిని దలపోయ నేడెంతొ ౹ మంచిదినము.

వెంక—అన్నులమిన్నా ! నీవు ఆలా అనకూడదు. నేను అంటానేమో అని ముందే నీవనేస్తున్నావు. నీవు మాచెడ్డదానవు. సామాన్యపు దానవుకావు. నీకోసం నేనెన్ని కష్టములుపడ్డాను. నాకు పట్టుదలయేగాని డబ్బుతోపనిలేదు. ఇప్పటికి నాకోరిక సాగింది.

మోహి.—నేనా మీరా కష్టపడ్డది. చాలు ! చాలు ! ఎవరికష్టా లెవరికి తెలుసును ?

తే. గీ. వలయుధన మిచ్చు రాయప్ప ౹ పంతులనుచు
దల్లి యెంతబోధించిన ౹ దాని వినక
నందచందము గలవాడ ౹ వంచుదలచి
నీకు వశమైతిని ప్లవ ౹ నీసురేంద్ర.

వెంక—(తనలో) ఇదినిజమే అయియుండవచ్చును. (ప్రకాశముగా) మోహినీ! నాకూటమికి నీవే సమ్మతింపలేదని విన్నానే. నీవు యీలాచెప్పుతున్నావే? ఇందు నిజంసంగతి యేమిటి?

మోహి.—నేను మీదగ్గిర అబద్ధమాడుతానా? రాయప్పపంతులుగారు చాలా రొఖముయిస్తామని కబురుపంపించినారని మాఅమ్మచెప్పితే అందుకు నేను వెంకటేశ్వరరావుపంతులుగారు వయస్సున చిన్నవారు, రూపవంతులు. మనముకోరితే యింకా ధనమిస్తారని చెప్పి మీయందుండే మోజుచేత మాఅమ్మను నేనే వప్పించినాను. మళ్ళీ, ఎందుకు ఈమాట మాఅమ్మతో అనకండి నామీద కోపపడుతుంది. మాచెడ్డది.

వెంక—(తనలో) దీనికి నామీద నిజంగా మోహంవుండే వప్పుకున్నది. లేకపోతే యెంతమంది కబురులుపంపినా వప్పుకుందా. పాపము! నమ్మినదానిని మోసముచేయగూడదు. ఇలాటిదానిని మరికాస్తఎక్కువగా సంతోషపెట్టవలెను. (ప్రకాశముగా) మోహినీ, రాగానే, అడుగుదామనుకొన్నాను. మరచిపోయినాను. నేనువచ్చేటప్పుడు నీగదిలోనుంచి యవతలకెవ్వరో పరుగెడుతున్నారు బహుశః జంగం లింగమూర్తి అని తోస్తుంది. వాడిక్కడ కెందుకువచ్చినాడు.

మోహి—వాడిజిహ్వాదీయ. లింగమూర్తి నాగదిలో కెందుకువస్తాడు. మాచంద్రియ్యతాత చుట్టకాల్చుకోడానికి వచ్చి వెళ్ళినాడు. అప్పుడే మీరు యీలాటిమాటలుగూడ మొదలుపెట్టినారు. కన్నెఱికము గాకమునుపే మేము వాళ్ళతోను వీళ్ళతోను తిరుగ మొదలు పెట్టినామనుకొన్నారా ఏమిటి. చాలుచాలు అటువంటిఘనులు మావంశంలోనే లేవు.

తే. గీ. తోడివేశ్యలరీతి నన్ గ్రూడకుండ
గౌరవంబును దయచేసి గాంచుడయ్య
లేనిపోనట్టి మాటల మానుడయ్య
కాకయున్న మీకిదె నమస్కారమయ్య.

మీరు చాలా గొప్పవారనియు విద్యావంతులనియు తలంచానుగాని యిట్టిలేనిపోని యపోహాలు పడేవారని తెలియదు. ఇదేం మీరు వెనుకవుంచుకొన్న చంద్రరేఖ అనుకున్నారా యేమిటి. మేమల్లాటివాళ్ళముగాము. ఎవరినినమ్మితే వారినే ఒకవేళ మాజాతి అల్లాటిది గదా యని యందరిని ఆలాగే అనడం న్యాయమా ?

వెంక—సరసాలకంటె కోప్పడతా వేమి ? పోనీ గాని వెనుక నేను వుంచుకున్న చంద్రరేఖ యని పలికితివే ? దానిసంగతి యేమిటి.

మోహి—ఏమైతేనేమి. చంపినారు. చచ్చినదానిసంగతి మళ్ళి యెత్తెకోవడం యెందుకు ?

వెంక—ఇదేమిటి, నేను చంపినానంటూవున్నావు. పోలీసువారు విన్నారంటే నన్ను కొట్లో పెట్టుతారు. నీపుణ్యమాయిరి. నీకో సలాం. గాని వూరుకో, (ఇంచుక యూరకుండి) నిజంగా ఆచంద్రరేఖకు ఆయుర్దాయము లేకపోయిందిగాని చాలామంచిది. పాపము దానికి నేనెంత సొమ్మిచ్చినాను. అందులకు దగినట్లు అదికూడా నాయడల చాలానమ్మకంగా ప్రవర్తించేది. మారెండుప్రాణాలు ఒక్కటేగా భావించి నడచేవారము. ఒకొక్కప్పుడు దానిమీద నాకు కోపంవచ్చి వెళ్ళిపోతే యెన్నాళ్ళకయిన నేనువచ్చేదాక అన్నంతినకుండా యేడుస్తూవుండేదని దానితల్లి నాతో చెప్పేది. నిజంగా అటువంటిమంచిది దొరకదు, అదిచావడం నీయదృష్టం.

మోహి—మా బాగా వున్నది లెండి.

[ తెలుంగో ]

ఏమే అమ్మాయీ, ఆషావుకారు వచ్చి కూర్చున్నాడు. లెఖ్ఖ యిచ్చి కంటె పుచ్చుకుంటేనే గాని వీలుగాదంటాడు. రా. మరి.

వెంక—ఆగ-దగ్గోళం యేమిటె.

మోహి—ఏం చెప్పనుగోల. నాకంటె ఈమధ్య అవసరానికి తాకట్టు వేసినాము. ఆషావుకారిప్పుడుతీసుకోవలసినదనిబలవంత పెడుతు న్నాడు. అదేగాక నాకలంకరించుకొనుటకు గట్టివస్తువైనా లేదు.

వెంక—అట్లనా పాపము. ఆలాగయితే అది యెంతకు తాకట్టు వుంచారు ?

మోహి—నూటయాభై యింటికి.

వెంక—ముందీరూపాయ లాతనికిచ్చి కంటె తెచ్చుకొని నిక్షేపంగా మెళ్ళో పెట్టుకొనిరా. బోసిమెడ యేం బాగుంటుంది.

మోహి—మీరు నూటయాభై రూపాయలు యిస్తారుగాని మీరు నాకిస్తానన్న నూటపదారుల కట్నంలో వేమో అని మాఅమ్మ నన్ను కోపపడుతుంది. పోనీలెండి. మరొకప్పుడు రమ్మంటాను. నాఅందానికి కంటెలేకపోతేనేమి.

వెంక—వెధవరూపాయలు. దానినిగురించి నీవు జడియవద్దులే. నేని చ్చుకుంటాను వెళ్ళిరా. (రూపాయలిచ్చును)

మోహి—(నిష్క్రమించి వెంటనే కంటెపెట్టుకుని ప్రవేశించును)

వెంక—ఇప్పుడు నిండుచంద్రుడులాగున్నావు. (ఇంచుక యూరకుండి) మోహినీ. కాసిన్ని మంచినీళ్ళు తెచ్చిపెట్టుదూ. చెంబు శుభ్ర ముగా నుంచాలు. మతసంబంధమైన పట్టుదల మాకులేదు. మేము సోషల్ రిఫార్మరులము.

మోహి—అదిగో, ఆబల్లమీద చెంబులోవున్నాయి తాగండి,

వెంక—ఎంగిలినీళ్లు కాదుగదా.

మోహి—నాయెంగిలి యిక నెకగడియలోతినరా ?

వెంక—అదేమిటి. నేను మీాయింట్లో భోంచెయ్యాలా యేమిటి ?

మోహి—(తనలో) ఈయన యింతసరసుఁడు. (ప్రకాశముగా) మీాగర్భము యేమిచిత్రమైన యూహాలను గలిగియున్నదండి.

వెంక—ఈకర్మమేమిటి. నాకు గర్భం తెచ్చి పెట్టుతున్నావు.

మోహి—అబ్బా ! మీాతో మాట్లాడలేనండి. మంచినీళ్లు తాగుదురు.

వెంక—(లేచి మంచినీళ్లుతాగును)

మోహి—పంతులుగారు కుంటుతున్నారే ? మరేంలేదుగద. ఏమో నాకు భయమేస్తున్నది.

వెంక—అబ్బే ! అదికాదే. నేను వస్తూవుంటే మామేనమామ యెదురయ్యేటప్పటికి ప్రక్క ప్రక్కగా సందులలోనుంచి వస్తూంటే ముళ్ళు గుచ్చుకొన్నాయి.

మోహి—శుభ్రమైన రోడ్డువుండగా ఆలా ఎందుకువచ్చినారు.

వెంక—నాబోటి పెద్దమనుష్యులు మీాయింటికి వచ్చేటప్పుడు రాధారీని రాకూడదు. ముసుగుఘేసుకుని యెవరుచూడకుండా బుడుంగున మీాయింట్లో "గప్‌చిప్" గా దూరవలెను. మళ్ళీ యెవళ్ళకయినా తెలిసినదంటే మర్యాదవుంటుందా ? ఈకాలం మన సొమ్ము మనముతిన్నా యితరులకేమేఁుపు. ఆగోలంతా యిప్పుడెందుకు. నీవు మాబాగాపాడుతావఁట. ఏదీ వక్కసారిచూస్తాను. రెండు జావళీలు హాయిగాపాడు.

[లోపల]

అమ్మాయి సిగ్గుపడతావెందుకు ? పంతులుగారిదగ్గిరపాడడానికి.

మోహి—

కన్నడరాగం—ఏకతాళం.

ఏలరా యీజాలము। చాలుర రారా సామి॥ నేడేలరా యీజాలము॥
వేలా గుల బహునా ట్లగ। ప్రేమ లత బద్ధ లమై రేయి పగ లోలీ
రతి। కేళి నోల లాడు దాము॥ నేడేలరా యీజాలము॥
నిన్న మొద లుగా నక। వన్నె లాడి నిన్ను కన్ను సన్న లచే బిల్చి
నటు విన్నా ను లే కున్న నేను॥ నేడేలరా యీజాలము॥
అంద గత్తె యని మది। యందు భ్రమ యకు రా డెంద మురా
యిరా మచ్చు మందుల మారీ గదరా॥ నేడేలరాయీజాలము॥
పాలు నీరు బోలి మును। మేలా మై యె ట్లుంటిమో ఆలీ లగ నుం
దాము శ్రీ లోలా సింహా పురి పాల॥ నేడేలరాయీజాలము॥

వెంక—సింహాపురి జావళిలాగున్నదే. అవిరచించిసిన దంపూరి సుబ్బారా
వుగారికి చెయ్యెత్తి దండము పెట్టవచ్చును. వినాలంటే ఆయన
జావళీ లేవినాలి యేది మరొక్కటి దర్బారురాగం మీాదది
కానియ్యి.

మోహిని—

దర్బారురాగం—ఏకతాళం.

యిది మంచి సమ యమో యీ। గోపాలా।
యికనై నా లేచి రావోయి॥
మదన జనక నాదు। మామ యింటను లేడు।
పదినె గా రిపుడె నక। వదలి అవతల కేగె॥
కదలి రావే జాల మేలోయి!
అర ఘడియ తాళిన సమయ మవ దోయి।
కొదువ మాట లింకేమి లే నా।
కోర్కె దీర్పుము తాళ జాల॥ ఇది మంచిసమయమోయి గోపాల॥

చెక్కిలినొక్కవోయి । కౌగిట జేర్చి । పొక్కిటి విడె । మియ్యవోయి॥
చక్కెర విలుకాని సోయగములకు నే ।
సృక్కితి నీ కిక । చిక్కితి దక్కితి ॥
టక్కు లెల్లను మాని వినవోయి ।
మొక్కు చుంటిని నన్ను గనవోయి ।
ఎక్కడికిలే నీదు మాటలు ।
ఒక్కసారైనను సరిలే॥ ఇది మంచిసమయమోయి గోపాల ॥
వలపు నిలుపలేనోయి। మోహమాపగ। వశముగాదని। నిజమోయి ॥
జలధి కిప్పుడె మగడు । జలక మాడుట కేగె ।
కలిగిన లేనిదే కళ్ళు లేనిది అత్త ॥
పిలచి నను రా । కుంటివే మోయి ।
ప్రేమ లేని హృదయముటోయి ।
తొలుత పలికిన పలుకు లిప్పుడు ।
తలపు నకు రా । లేదటోయి ॥ ఇది మంచిసమయమోయి గోపాల ॥
పదులె వ్వారును లేరోయి। యిప్పుడు నిను। పగలైతే భయమేమోయి।
ధరణి నారాయణ దాస పోషక నాపై ।
కరుణ జూపుము వృధా । జాల మూపన మేల ।
సరసులకు ఇది తగదు వినవోయి ।
సరస జేర నీ కేమి కొఱవ వోయి ।
సిరికి మోహా లొడ్డు సామిత్తె ।
చెప్పనీ కడ చెల్లె నోయి ॥ ఇది మంచిసమయమోయి గోపాల ॥

వెంక — మధ్యమార్చే శావే. నారాయణదాసుగారిది వేశాపు. ఈయన చాలాగొప్పవాడే. సరే బాగానేవున్నదిగాని గబ్బిటయజ్ఞనారాయణగారు చేసిన కోమలాంగి తాళకున్నదిరా॥ అన్నదినీకు వచ్చునా? పోనీ అదిరాకపోతే మరుబారికోర్వజాలరా అన్నది

పాడు. అదిరాకపోతే. దాసు శ్రీరాములుగారు చేసిన నాటికి నేడా మీదర్శనము. అన్నది పాడు.

మోహి.—

హిందూస్తానికాఫీ—ఏకతాళ.

నాటికి నేడా మీ దరి శనము ।
నమ్మిన దానిని బాయుట న్యాయమా ॥ నాటికినేడా ॥
చేర బిలచి । చెక్కిలి ముద్దు గొని ।
చెవి నొక మాట । చెప్పిపోతివి ॥ నాటికినేడా ॥
ఈ పరిచయము । యెన్నడు మరు వక ।
రేపె వచ్చెద నని బాసలు చాల జేసి ॥ నాటికినేడా ॥
భాసుర నక్కలంక రామ జోగా రావు ।
దాసు శ్రీరామకవి జేసిన శృంగారము ॥ నాటికినేడా। మీదరిశనము॥

వెంక—దాసుశ్రీరాములుగారు అంటే ఏమనుకొన్నావు. శృంగారము పరమ ధారమోస్తరుగా గురుపించేసేరు (ఇంచుకయూరకుండి)— నీవేమో అనుకున్నాను. చాలాఅసహాయశూరురాలవు. ఇదంతా యెప్పుడునేర్చావు. నీముందు చిలుకసాని, జోగిసాని, సుభద్రి, లక్ష్మీనారాయణగూడా పనికిరారు. అయినా ప్రాపకాలినిబట్టి పెద్దపేర్లువచ్చేయిగాని మరొకటికాదు. ఇంకనీవు చూస్తావుగావు. నాప్రాపకము దొరికిన నీపేరుయెల్లాబైటికివస్తుందో (ఇంచుకయూరకుండి) చాలాప్రొద్దెక్కుతుంది పడుకోవాలిరా.



రంగము.

[ప్రవేశము డాక్టరు కొండయ్యనాయుఁడు.]

కొండ—(తనలో)

తే. గీ. భార్యయేకదా సకల సౌ । భాగ్యములకు
బట్టుకొమ్మ యటంచును । బలుకుచుంద్రు
అట్టి నిజసతీమణి లేని । యట్టిబ్రతుకు
కానఁ గాచెకువెన్నెల । కరణి గాదె.

ఈమధ్య నాభార్య చనిపోవడంచేతను మనస్సు విరక్తిపుట్టి యేమిీతోఁచక వైద్యంమానివేసుకొని అనుదినం సాయంకాలమందు సానివాళ్ళవీధిలోని దేవాలయమునకు వెళ్ళి అక్కడకూర్చోడం ప్రారంభించేటప్పటికి, భగవత్సేవకై యక్కడకువచ్చుచున్న మీనాక్షిమేళంలో దానికూతురైన మోహినినిచూచి నామనస్సు చలించిపోయింది. అది అభినయంపట్టుచున్నప్పుడెల్ల నాకళ్లు దానిమీదనేయున్నవి. నేను దానికేసిచూడడం దానితల్లియగు మీనాక్షిచూచి అదికూడా నాకేసి తెగచూడడం మొదలుపెట్టింది. ఆకారణంచేత అది నాకు మోహినిని కూరుస్తుందని తలుస్తాను. కాని ధనము తెమ్మంటేమాత్రము నాకు ప్రాణసంకటము. ధనమునకును నాకును లంకె. నేను డబ్బువదలను. డబ్బు లేకుండా వుండేమార్గము చూడవలెను. మర్యాదకు భంగముండకూడదు. బెట్టుసరిమీద వ్యాపారము జరుగవలెను. ఇన్ని కుదరవలెను. (ఆలోచించి) పరవాలేదు. నాచేతులో సకలజనులను మోహింపచేసేటటువంటి రాజవైద్యమున్నదికదా. నేనెల్లాగయినా మోహినిని అతుక్కుంటినా దానియింట్లోవుండేవాళ్ళందరకు జబ్బులు డబ్బుపుచ్చుకోకుండా కుదురుస్తూ దీనికి దానికి వరుసగా సర్దుకుంటాను. అదుగో భగవత్సేవయైపోయింది. మేళం యింటికి వెళ్ళిపోతున్నది.

తే. గీ. ఫేసుపౌడరు మోముపై వాసిమీఱ
ముసలితనమును దాపగా బూసికొనుచు
సొక్కుచును సోలుచును వచ్చు సుందరులను
సరగఁ గాంచిన గుండెలు జల్లుమనవె.

[మీనాక్షి ప్రవేశము]

మీనా—(తనలో) ఈకొండయ్యనాయుడు మేము గుళ్లో మేళము చేస్తున్నంత సేపూ యీయనకళ్ళు మామీద నేయున్నవి. ఈతనినిఁ బలుకరించిచూస్తాను. (సమీపించి) ఏమండోయి నాయుడుగారూ అనుదినము మాసంగీతము చాలాశ్రద్ధాభక్తులతో వింటున్నారు. ఇన్నాళ్ళకు నానులమీద దయవచ్చిందా?

కొండ—అవును. మాకిప్పటికివచ్చింది. అందుకుతగినట్లు మీకుగూడా మామీదవుండవలెనుగదా? రెండుమనస్సులు యేకమైనగాని సఖ్యము వాటిల్లదు.

మీనా—ఎంతమాట శెలవిచ్చినారు? మేమంతటివారమా?

తే. గీ. ఎపుడు మీవంటివారలు యేగుదెంత్రు
మాగృహంబులకంచును మదినినెపుడు
సంభ్రమంబొందుచుందుము సంతతంబు
దాసులము మేము మీకు నో ధన్యచరిత.

కం. కలనైనను దమయానతి
దలపైన ధరించిచేయు దప్పక యనుచున్
దలపోయుదు చిత్తంబున
బలువిధముల మిమ్ము నేను ప్రార్థన జేతున్.

మాగృహంబున మీకెట్టికొఱంతయు గలుగదు, దయచేయుడు.

కొండ—(తనలో) దీనియుద్దేశం మోహినితో నాకు స్నేహం కలప డానికనే తోస్తుంది. (ప్రకాశముగా) మేళంవాళ్ళంతా రాన క్కరలేదా ?

మీనా—వాళ్ళజోలి మనకెందుకు? వాళ్ళేవస్తారు రండి.

(చేయిబట్టుకొనుచున్నది)

కొండ—(కోపముతో) నాచేయివదులు.

మీనా—అయ్యో. చెయ్యిపట్టుకుంటే బెదురుతారేమి?

కొండ—ఏమీలేదుగాని, నిన్ను కొన్నాళ్ళు మాపినతాతగారుంచు కొన్నారట నిజమేనా.

మీనా—అందుకనేకదా మీచెయ్యింత చనువుగా పట్టుకొన్నాను. మరొక్కవేళ్యయితే యిల్లాపట్టుకొనుటకు గుండెలున్నాయా? (కౌగిలించుకొనబోవుచున్నది)

కొండ—ఛీపూరుకో. మాఅమ్మతో సమానవయస్సుగలిగిన నీవు న న్ను కౌగలించుకొనుచున్నావా. నీకుసిగ్గయినాలేకపోయిందే.

మీనా—అబ్బాయిగారూ.

తే. గీ. మీదుతాతకళలెల్ల \ మీరు కలిగి
యుంట, నాయనయు బ్రతికి \ యుండినపుడు
మనసుతీరకయుంటచే \ మనసుకలిగి
కౌగలించుకొంటెని మిమ్ము \ గాంక్షదీర.

(ఇంచుకయూరకుండి) నాయుడుగారూ సరసాలాడితే బెదరిపో తారేమండి? మీచిత్తం పరీక్షించడానికియీలాచేసినానుగాని, మీరు మాత్రం పొరపాటుబడ్డారు. ఇకార్యమునకు ఒకవేళ మీరు ఒప్పు కొన్నా నేనుఒప్పుకుంటానండీ. ఎంతమాట! ఎంతతప్పు!! చాలుచాలు

లెండి ఇంకసరసము. ఆమాటకేమికాని యిప్పుడు మీకు కావలనది నాకూతుళ్ళలో యేది ?

కొండ—నానోటితో చెప్పించవలెనని యడుగుతున్నావుగాని నీకు తెలియకున్నదా.

మీనా—మోహినియేనా యేమిటి?

కొండ—మరియింకెవ్వరని తలుస్తున్నావు?

మీనా—సరే యింటికిదయచేయండి. నేను వెళ్ళుతూవుంటాను.

(నిష్క్రమించును)

కొండ—అమ్మా! వేశ్యలలో నెంతవాళ్ళున్నారురా? నాయినా! కొం పలుమింగేసేవాళ్ళున్నారు. కంట్లోకారంకొట్టి మాయలో పడ వేసేవాళ్ళున్నారు. ఇప్పుడుమట్టుకు వృద్ధవేశ్య నేను తన్నువల చినానని తలంచి నన్ను మోసముచేయతలంచినది. ఇంకేము న్నది. ఇల్లా మోసముపొందువా రనేకు లుందురుగదా! తా త్రిసమయంబులందు.

తే. గీ. మంచిదుస్తుల ధరియించి ♦ యంచితముగ
సీటుగోటుగ దిరిగెడి ♦ బోటిజూచి
ముక్కిదో ముసలిదో; యంచు ♦ నిక్కమింత
యైన నరయ కుండంగనే ♦ యతివగలయు
చుందు రక్కటా కక్కూర్తి ♦ శుంఠ లిలను.

పీటిపేరే నాఫ్రెండ్సంతా „చీపర్ జాబ్సు" అని అంటూవుంటా రు. ఈసత్రిందగ్గిర ఆసత్రిందగ్గిర పనిపాటులులేకుండా యిదేపనికింద తిరిగే మాసుబ్బరామయ్యపంతులికి, యీ "ఛీపర్ జాబ్సు" విషయము అనుభవము బాగావున్నది. సరే ఇప్పుడిదియెందుకు, నేను డ్రెస్సువేసి కొని మోహినిదగ్గిరకు వెళ్లవలెను.

(నిష్క్రమించును)

రంగము.

[మోహిని మందిరములోగది కొండయ్యనాయుడు ప్రవేశము.]

కొండ—(తనలో)

తే. గీ. ధనములేకుండ యేవార కాంతనైన
గలసినట్టివాఁడీ త్రిలోకముల లేదు
నేనెపో కృతార్థుండను నిక్కముగను
గర్వమైన వెచ్చింపక కలయుచుంటి.

ఈమోహినితో స్నేహంజేసి డబ్బుఖర్చు లేకుండా హాయిగా కాలక్షేపము చేస్తున్నాను. ఏకొంతంత కలగడంలేదు. అందుకుదగినట్లు నేనుగూడ వీళ్ళయింట్లో వున్నవాళ్ళకు సుఖరోగచికిత్స చేస్తూనేయు న్నాను. (ఇంచుకయూరకుండి) గుడ్డలన్నీ చిరిగిపోయినవి. బట్టలసాహు కారుకు గుడ్డలకు చీటివ్రాసి తెప్పించవలెను. (చీటీవ్రాస్తున్నాడు.)

[మోహిని—ప్రవేశము.]

మోహి—ఏమండో నాయుడుగారూ! ఏమిటో చేస్తున్నారే?

కొండ—ఏమున్నది. బట్టలు చిరిగిపోయినవి. నాలుగు గుడ్డముక్కలు పంపుమని బట్టలసాహుకారుకి వుత్తరము వ్రాస్తున్నాను. అంత కుతప్ప మరియేమీ లేదు.

మోహి—ఓహో! ఈవాళ నారోజుపండుగదే. నాకుగూడ రెండుమం చిచీరలు తెప్పించిపెట్టుదురూ.

కొండ—వేంకటేశ్వరరావు నీకు గావలసినవన్నియు సప్లయిచేస్తుండగా మళ్ళీ నన్ను అడుగుతావెందుకు?

మోహి—మీరావ్రాసు యెత్తుతారెందుకండి. ఆయన దయవచ్చి యిచ్చినారు. మీరుమాత్రం యియ్యకూడదా? నేను పుచ్చు కోకూడదా?

కొండ—అందుకోసంకాదుగాని, నిజంగా నీకు చీరెలులేక నన్ను అడిగి నావా లేక, వేంకటేశ్వర్లుయిస్తున్నప్పుడు నేనుమాత్రి మేల యియ్యకూడదని అడిగినావా ?

మోహి—మీరేమనుకున్నాసరే. నేను మీకుమాత్రిము జవాబు చెప్పలేను. అదియునుగాక నేనందుకోసంఅనడంలేదు. డబ్బుకు వేంకటేశ్వరరావు పంతులుగారును, ఊరికేమాట్లాడడానికి కొండయ్యనాయుడుగారును అని రేపు మీరే పరియాచకానికంటే నేనేమని చెప్పగలను ?

కొండ—తే. గీ. భార్యయరుదెంచి నను గాంచి ॥ వస్తువాహ
నంబులకును వేశ్యయును, నూడి ॥ గంబుసేయ
నేన యనుచువచించిన ॥ నేమియుత్త
రంబు నిత్తును జెప్పుమా ॥ యంబుజాక్షి.

మోహి—మీపెళ్ళానికి మీరేంకొని పెట్టరాయేమిటి ?

కొండ—లేనిదైతే యెవరికైనా కొనిపెట్టవచ్చును. అందుకు సందియము లేదు. వుండగా ఒకదానిమీద ఒకటియెందుకు ? ఏదన్నా వస్తువు వుంచుకొని నన్నెవరైనా అడిగితే నేను ఆకాశము చూపించేరకములోవాడిని.

మోహి—అల్లాగయితే నాకు కట్టడపుకాసులుపేరు తెచ్చిపెట్టండి.

కొండ—అదియెంతపని.

ఉ. కాసులపేరనంగ విను ॥ కాంతరో స్వల్పపుకార్యమేసుమీ
వాసిగ గోలుకొండకు ది ॥ వాణ్ పని నాకు నొసంగనీయుమా
కాసులపేరుదెచ్చెద జ ॥ గన్నుతి బొందెద నీకునిచ్చి యో
భాసురగాత్రి సందియము ॥ బాయుదగుణ్ భువనైకమోహినీ.

మోహి—నాయుడుగారూ. మీరీలా పలికితే మాకెల్లాగడుస్తుందనిఅను కున్నారు. మీకునేను చెప్పవలసిన యంతటిదాననా.

కొండ—నీవుచెప్పింది బాగానేవుందిగాని మీయింట్లో సంపాదించే వాళ్ళు నాతలవెంట్రుకలంతమందివున్నారు. మీయింట్లోనికి మల్లే మాయింట్లో లేరుగదా. నేను ఒక్కడనే కష్టపడవలెను. ఒకవేళ నీకు గడియనివేళవస్తే యేంచేస్తాను. ఏలాగునో మా యింట్లో ఇంకొకమనిషి యెక్కువయిందనుకుంటాను. భయ పడవద్దు.

మోహి—మాయింట్లో చూడండి. యెంతమంది ముసలిముండలు వున్నారో. వీళ్లందరికి గడవడం యేలా!

కొండ—బాగున్నది. ఈముసలిముండలనందరిని పోషించమంటే యెవ డుపోషిస్తాడు?

మోహి—మీయింట్లో ముసలిముండలు లేరా? వాళ్లను మీరుపోషిం చనక్కరలేదా.

కొండ—మాయిళ్లల్లో వెధవముండలు మీయింట్లో మాదిరిగాదు. ఒకొక్కళ్లకి సంవత్సరానికి రెండేసివందలు మూడేసివందలు వచ్చే వసతివుంటుంది. అది వాళ్ళు తమవాళ్లకిచ్చి వాళ్లదగ్గర వుంటారు.

మోహి—మీరు ప్రతిదానికీ ఏదోవుత్తరం చెప్తూనే వుంటారు. ముక్కలకు ఏమీ తడుముకొనక్కరలేదు. నీదిఅక్షరాలబొజ్జ యని చెప్పవచ్చును. అల్లాగయితే మీపాప్రపుగాంచినందువలన మేమందుఫలిత మేమున్నది?

కొండ—మీయింట్లో అందరికీ సుఖరోగాలు కుదర్చడమే.

మోహి—అట్లయిన తాంబూలపుఖర్చుగూడామీరు పెట్టుకోనక్కరలేకదా.

తే. గీ. వైద్యవేషులౌ వారెల్ల ◌ పైకి చేత
నౌనటంచును బల్కి దర్వ్యంబులాగి
కడకు రోగికి మృతిగూర్చి ◌ గ్రాలుచుందు
పుడమి, బ్రతివారినమ్మిన ◌ మోసమగును.

మీనా—అవును నీవు చెప్పినది బాగానేవున్నది. కాని నీదగ్గరకువచ్చే సరసులు మనకు యెప్పటికప్పుడు డబ్బుయిచ్చి వేస్తున్నారా? బకాయపెట్టుతున్నారా ?

మోహి—నేనల్లావుండడానికి వెర్రిదాననుకొన్నావా యేమిటి ?

మీనా—వెంకటేశ్వరరావుగారు యీనెలజీతం యిచ్చివేసినారా ?

మోహి—లేదుగాని, ప్రతి నెలజీతమునకు పదిరెట్లుగాగుంజుతూవుంటే మళ్ళీ జీతం దెమ్మనియడుగుట బొత్తుగామర్యాదగాదు. అందుచేత వూరుకొన్నాను. సమయముచూచి నెమ్మదిగా అడుగుతాను.

మీనా—నేను మరొకందుకు చెప్పడంలేదు.

తే. గీ. పీల్చి పిప్పిగా గావించి ◌ విడిచె చంద్రి
అట్టి యీతనిమనమెట్లు ◌ యంటుకొంటి
మందుచే మిగిలినది కా ◌ సంతయైన
గుంజుకొనవలె తప్పక ◌ కోమలాంగి.

అదియునుగాక, యీతడు లోకుల కనేకములైన బాకీలున్నవాడట దానికై కోర్టులో కంప్లయింటుగూడా దాఖలగుచున్నదట కాబట్టి దీపముండగానే చక్కబెట్టుకొమ్మన్న సామెతగా మనము ముందుగానే జాగ్రత్తపడితే మంచిది.

మోహి—అల్లాగయితే మంచిదే. ఏలాగైనా వేంకటేశ్వరావుగారి చేతికున్న వుంగరములు పదిన్నీ లాగుకొనవలెను.

మీనా—ముందాపనిచెయ్యి. సరేగాని నీతోయింకొక సంగతిచెప్పడం

మఱచిపోయినాను. ఈవూళ్ళోకివచ్చిన వైష్ణవాయన్ని చూచి నావా. మఱచిపోయినానే! ఆయనపేరు యేదోవుండాలి. ఆఁ జ్ఞప్తికివచ్చింది. రామానుజాచార్యులు. ఆయనకు ఈవూళ్ళో పొలంవుంటే అది అమ్మివేసి నిన్ననే సొమ్ముర్జిస్ట్రారుకచ్చేరీలో పుచ్చుకొన్నాడఁట. ఆసొమ్ముతో నేమో పెండ్లిచేసుకుంటాడట మనము ఏలాగునైనా ఆయనను మనవలలో పడవేస్తిమా నాల్గువేల రూపాయలు ఒక్కసారి యింటికి ఘుళ్ళునువచ్చిమన యిల్లు ఒకబాంకితో సమానముగావుంటుంది. ఎన్నాళ్ళుసంపాదిస్తే యిన్నిరూపాయలు వచ్చిపడతవి. తరువాత కంసాలివీరయ్య, రామన్నపంతులు, చినరాజు శెట్టి, యేదోమోస్తరుగా యిస్తూవుంటామన్నారు. వాళ్ళకుగూడా ఏదోవీలుచేయి. వయస్సప్పుడే డబ్బు సంపాదించుకోవడం. ఒకవేళ ఒకరువుండగా ఒకరువచ్చినట్టయితే యేదోదారిని పంపివేస్తూవుండు. ఆసదుపాయంకోసమే మనయిళ్ళకు అనేకవాకిళ్ళు వుంచుతూవుంటారు. తెలిసిందా ఎవరిదగ్గిరమాట్లాడేటప్పుడు వారిమీందనే ప్రేమవున్నదని చెప్తూతుండవలెను.

**మోహి**.—అమ్మా.

తే. గీ. నన్ను బలవంతపెట్టుచు నాకువిద్య
నేలలోపల గల్పి యీ నీచవృత్తి
యందు దింపనేదింపితి వందుకేను
సేయుచుంటుని నీవును చెప్పినట్లు
కాని ముందేమి దొసగులు గలుగనగును.

భోజనానికి వేళయింది. రమ్మా.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)



రామ—(తనలో) వీడంటున్నమాట నాకు చాలాకష్టము తోపించు చున్నది. వీడు నన్ను దెప్పిపొడుస్తున్నట్టున్నది. కానిమ్ము ఈబడాయకోరువెధవకు పదిమందిలో ఒక్కసారి పరాభవంస్తేనే గాని బుద్ధిరాదు.

(ప్రకాశముగా) ఏమండీ, వెంకటేశ్వరరావుగారూ. మీరయితే చాలాబుద్ధిమంతులేగాని కవులను దూషించడం ప్రారంభించినారేమిటి. అంతా వెధవకవులయితే పునిస్త్రీకవులెవ్వరండి ?

వెంక—నాకెవ్వరికవిత్వము నచ్చదండి. నాకల్లా రామశాస్త్రిలుగారి కవిత్వం నచ్చింది. ఏదయిన గ్రంధమువ్రాయాలంటే ఆయనే వ్రాయవలెను. ఏమి అయిడియాస్, ఏమి వుపమానాలు, ఏమి అలంకారాలు, ఏమిశబ్దములు ఏదైనాసరే ఆయనకే చెల్లినది. తక్కినకవులంతా ఆయనకాలిగోరుకైనా పోలరు.

రామ—ఏమయ్యా, నీకు యెప్పుడును పరులనుదూషించుటయే యుద్యోగములాగున్నది. రామశాస్త్రిగారు గొప్పవారని చెప్తూతూ అందరికవులను దూషింపపారంభించినావు. మొన్నను అల్లాగే నాటకము ప్రదర్శించు సమయంలో పాపము ! ఏమీయెఱుగని వట్టిఅమాయకుడు కల్లకపటముల నెఱుగనివాడు, ఆశాస్త్రిని బట్టుకొని ప్లీడరుగారు వింటుండగానే దూషించివేసినావు. ఏమయ్యా ! వెంకటేశ్వరావుగారూ ! నేనొకటి చెప్తాను వినండి, మీకు రామశాస్త్రికవిగారియందు అభిమానంవుంటే వుండుగాక. ఆయన చాలాగొప్పవాడని అభిమానపురస్సరంగా బలకండి. అంతేకాని అందరినీ దూషించకండి.

తే. గీ. బుద్ధిమంతుఁడ వీవిట్లు పూజ్యులైన
కవుల దూషింపలాభంబు గాంచఁగలవె

గడు నసూయపరుడని లో । కంబులెల్ల
నిన్ను దూషించెదరుసుమ్ము । నిక్కముగను.

కావున నింక నెప్పుడును నట్టిమాటలుపలికి నోరు ఖరాబ్ చేసికొనకు.

వెంక—పోవోయి "టప్పాస్" ఏమిటోమాట్లాడుతావు. నేను నిజమే చెప్పినానుగాని అబద్ధంచెప్ప లేదు. రామశాస్త్రికవిగారి పద్యం మోస్తరు పద్యం ఒకటి నీవు వ్రాసిననాటకంలో చూపించు ఇదిగో ఈపద్యంచూడు. చదువుతాను.

"సీర, హార, తార, డిండీర, పటీర, వార, మార, శూర, వీర, ధీర, గభీర, పాటి, మేటి, కోటి, బోటి, సూటి, లంకేశ్వరా".

రామ—అబ్బా! ఏమిపద్యమండి. ఎంతపొడుగుందండి. ఒక ఉపమానం మీద లాగేసినారు.

వెంక—ఇటువంటిపద్యము ఒక్కటివ్రాసేవారిని చూపించండి.

రామ—వ్రాసేవారున్నా చదివేవారు లేరు. చదివేవారున్నా వినే వారులేరు. ఇంతదీర్ఘసమాసపద్యం మరొకరినోట పట్టదు. మీరంటే శాస్త్రిగారిశుశ్రూష చేసినారుగనుక యెంతదీర్ఘపు దైనా మీనోట పట్టుతుంది.

వెంక—మీనాటకాలు యిన్ని చూచినాను. సారస్యమైనపద్యం ఒకటి లేదు. అన్నీదొంగతనంగా వ్రాసినవే.

రామ—ఏమిరా! శుంఠా!

తే. గీ. కనులు నెత్తిపై కెక్కెనా । కానికూత
లవసాగితి వీవిప్డు । డాత్మయందు
చిన్న పెద్దలు వీరన్న । భీతిలేక
చెప్పుబెట్టి కొట్టించెద । చెనటినిన్ను.

రంగము.

[మోహినియింటి సమీపమున బయలు. కొండయ్యనాయుడు,
కంసాలివీరయ్య, రామానుజా చార్యులు,
రామన్న పంతులు, ప్రవేశము]

కొండ—ఏమండీ ! రామానుజాచార్యులుగారూ ! ఈమధ్య ఎక్కడా దర్శనమే లేదే. గ్రామాంతరము వెళ్ళినారా ? లోకాంతరం వెళ్ళినారా ?

రామా—అదేమిటండీ. ఆయన్ని లోకాంతరం వెళ్ళమంటా రేమిటి ! బాగా చెప్పినారే !

వీర—మీ రెవ్వరినో ఒకరిని ఆడిస్తూనే యుంటారుగదా !

రామా—నాయుడుగారూ. నిజంగా మీరన్నట్లు లోకాంతరానికి వెళ్ళ వలసిందేగాని తప్పిపోయింది. అదేమికారణమోగాని ఒకటే వాంతులు పదిహేనురోజులబట్టి అవుతూవున్నవి. ఏదియైనా మంచిమందు యిప్పిద్దురూ.

కొండ—పెళ్లికోసం పొలం అమ్మి తెచ్చిన రూపాయలు ఖర్చుపెట్టి అదేపనిగా మోహిని అధరామృతంతాగితే పసరు పెరిగింది.

వీర—మామంచిముక్క వేశావయ్య నాయుడుగారూ.

రామా—నీబతుక్కి నన్నుకూడా యెక్కిరిస్తున్నావు ?

కొండ—రామన్న పంతులుగారూ. మీరామోహినికి శృంగారప్రబంధములు నూరిపోయకపోతే డబ్బుమీద విరాగముపుట్టడానికి వేదాంతము బోధిస్తురూ !

రామ—వేదాంతము వైష్ణవులసొమ్ము. దీనికి రామానుజాచార్యుల వారే తగినవారు.

వీర—వేదాంతం విశ్వబ్రాహ్మలదికాని వైష్ణవులదికాదు.

కొండ—ఏమండోయి ఆచార్యులుగారూ "పులిమీదపుట్రి" అన్నట్లు మీమీద అప్పీలువచ్చిందే.

**రామా**—అతని కేమి తెలుసునులెండి.

వీర—ఈయన కేం తెలుసును. నూటపదకొండు.

**రామా**—నోరుమూయించెదను. అష్టైశ్వర్యములకుము. లింగకాయతీసి మోహినికి కాసులపేరులోకియిచ్చిన సప్తకట్లవెధవవు నీకు పరువుకూడానా !

వీర—నీపరువు చెప్పుకోవాలి. గుళ్ళోవిగ్రహాలు దొంగిలించుకొనివచ్చి యవి కరగించి ఆబంగారం బెట్టి మోహినికి గజ్జెలపట్టెడ నీవు మాత్రము చేయించలేదూ ?

**రామా**—నాయుడుగారూ. తుచ్ఛులతో మాట్లాడగూడదు.

**కొండ**—కేకలువేయకండి. అడుగో వెంకటేశ్వర్రావు వస్తున్నాడు. మోహినిదగ్గరకు మనమిప్పుడు వెళ్ళకూడదు. వీడువెళ్ళిపోయిన తరువాత వెళ్లుదాము. ప్రస్తుతము మనప్రశ్న వీనినడుగుదము.

[వెంకటేశ్వర్రావు ప్రవేశము]

వెంక—(తనలో) ఈజట్టంతా యిక్కడచేరింది యెందుకోకదా. అల్లరి మూక. కుక్కలు కాట్లాడుకొన్నట్టు పోట్లాడుతున్నారు. (సమీపించి) ఏమండీ ! మీరంతా తగాదాపడుతున్నారు.

రామ—ఏమీలేందడి. వేదాంతం వైష్ణవులసొమ్మా విశ్వకర్మలసొమ్మా అని వీరికి తగాదాపడ్డది.

వెంక—ఏగ్రంథములేండీ. నాకేదీబాగుండదు. పుస్తకాలసంగతి నాకు చెప్పకండి. నామనసుకు సరిపడ్డగ్రంథమేలేదు. ఏంపురాణాలు, ఏంవేదాంతగ్రంథాలు వ్రాయడం. ఏంనాటకములు గిలకడం. అందులోచూచి యిందులోచూచి వ్రాయడమేకదా ! ఇప్పటి కవులంతా వెధవలు.

ఓసీ. నీవు సన్నాక్షేపించుచుంటివా. నీపరిభాష మాడిపోయిరి. శవాలుమోసుకొని బ్రతుకవలసిన సన్తకట్లవెధవవు నీవుకూడా చదువు కొన్నవానివలె కవిత్వముసంగతి మాట్లాడుతున్నావు. నోరెత్తితే కంపు కొట్టుతుంది.

కొండ—(తనలో) వీళ్ళిద్దరికీ కజ్జా పడ్డది. ఈవెంక టేశ్వరులుకి పరాభవం కావలసినదే. (రామన్న పంతులునిజూచి) పంతులుగారూ! వెంకటేశ్వరావుగారికి తొందరగామాట్లాడడం అలవాటు గాబట్టి మీరు మన్నించి వూరుకొనండి.

రామ—ఏమివూరుకోనండి. వీడెప్పుడూ యింతే. ఎప్పుడో ఒకప్పుడు వీపు శుద్ధిచేస్తే నేగాని ప్రయోజనంలేదండీ.

వెంక—నీవంటివాళ్ళు ఎంతమందయినాకో.

రామాను—తమకు వీపుశుద్ధిచేసినవారా?

వెంక—ఆచార్యులుగారూ! నేను మీతో మాట్లాడలేదు, మీకెందుకండి. (రామన్నపంతులునిజూచి) ఏమోయి పంతులూ! నీవెప్పుడో నాకు వీపు శుద్ధిచేస్తానంటున్నావు కాని నేను యిప్పుడే చేశేస్తాను. చూడు నాదెబ్బ. (సమీపించుచున్నాడు)

రామ—కొండయ్యనాయుడుగారూ. చూచినారా వీడికొంటెతనము. నేనుగనుక శాపమిచ్చివేశానంటే అది త్రిప్పడానికి బ్రహ్మాదులకైనను తరముగాదు. ఇంక యిచ్చివేస్తాను. ఏమైనాసరే. చూడండి. ఈలాటివెధవలు వుండడం భూమికిబరువు.

చం. అరయక చిన్న పెద్దలని ♦ యంగితభేదము బూనకుండ యీ
 కరణి మదాంధుడౌచు గడు ♦ గాఋలు బ్రేలుచునున్న యట్టి దు
 శ్చరితుడు సాధుదూషణుడు ♦ సద్గుణహీనుడు వెంకటేశు డా
 హారుసిలలాటదృష్టినిబ ♦ హంబుల బొల్పడి స్వస్థుడయ్యెడిన్.

కొండ—హరహరా! ఎంతమాట.

వెంక—"ఓస్" "ఓస్" ఇల్లాటివాటికి జడిసేవాడినిగాను. 'పోరా పుల్లయ్యా!

కొండ—రావుగారూ! మీఅక్కగారికి ఈమధ్య "విడోమ్యారేజ్" చేతామనుకొన్నారట. నిజమేనా.

వెంక—ఏమండోయి. నాయుడుగారూ. మీరు నాతో యీలాటి మాటలేనా ఆడడం?

రామా—వెంకటేశ్వరరావుగారూ. నీళ్ళకావిళ్ళ హనుమయ్య మీ యింట్లోనే వున్నాడా?

వెంక—(తనలో) ఇంక వీళ్ళదగ్గిరవుంటే నన్నుయీలాగే ఆడిస్తారు. నెమ్మదిగా వెళ్ళిపోతాను ఇప్పుడుమాత్రము నేను మోహిని యింటికి వెళ్ళితే వీళ్ళంతాచూచి ఏడిపిస్తారు. (ప్రకాశముగా) నాయుడుగారూ. నాకు చాలా తొందరపనియున్నది. నేను వెళ్ళెదను.

కొండ—మీకేంతొందరలెండి. మోహినియింటికి వెళ్ళడమనగా. డబ్బు పోతేపోయిందిగాని రవ్వవంటిపిల్లను చేరదీసినావయ్యా. చాలా డబ్బు దానికిచ్చినావట. పాపము దానికోసం మీఅమ్మగారియొక్కయు అక్కయ్యయొక్కయు నగలుకూడా తాకట్టుపెట్టినారట నిజమో, అబద్ధమో యెవ్వరో అనుకుంటుండగావిన్నాను.

వెంక—పోనిస్తురు. ఈసంభాషణ కూటికివచ్చిందా గుడ్డకువచ్చిందా.

రామా—ఇంక నతనిని వదలిపెట్టండి.

కొండ—రావుగారూ. తిరిగీ ఎప్పుడుదర్శనం యిప్పిస్తారు.

వెంక—ఊళ్ళోనేవుంటాను. ఎక్కడకీవెళ్ళను. ఎప్పుడుపడితే అప్పుడే కనిపిస్తాను.

కొండ—మంచిది దయమాత్రిం వుంచండి.

వెంక—(తనలో) అమ్మయ్యా. ఈగంద్రిగోళంలోనుంచి తెములుకున్నాను. వీళ్ళంతా "రౌడీస్" తన్నినను తన్నగలరు. మాకిప్పుడు దెబ్బలాటపెట్టినవాడు కొండయ్యనాయుడే కాని వీడిసంగతి చెప్పుతాను. (నిష్క్రమించును)

రంగము.

[మీనాక్షి, మోహిని ప్రవేశము]

మీనాక్షి—(ప్రవేశించును)

మోహి—అమ్మా! శ్రీరాములుపంతులుగారు వచ్చినారంటివే. ఏరి!

మీనా—వెఱ్ఱిమొఖమా! దివానుగారైన శ్రీరాములుపంతులుగారు మనయింటికి వస్తారటే. ఆలాగంటేకాని యీతుక్కోజీ రాయళ్ళంతా వెళ్ళిపోరని ఈనెపంపెట్టినాను. వెనుక నీకు బందరులో కన్నెటికముపెట్టిన నరిసింహంగారు వచ్చినారు.

మోహి—ఇపుడెక్కడ మనయింటిదగ్గరనే యున్నాడా?

మీనా—అవునే ఈవూరేదోపనిమీద వచ్చినాడుకాబోలు. నిన్ను జూడడముకు వచ్చినాడు.

మోహి—ఆలానా. ఆయన చాలా ధనముకలవాడు. ఈమధ్య నేమో పొలములన్నీ తాకట్టువేసినాడటగాని యింకా యేమాత్రిమోవున్నది. ఇతడెప్పుడూ భార్యను ఇంటికాడవుంచేసే తుంటరిస్నేహితులతో ఆవూరు ఆవూరు చక్కరలుకొట్టుతుంటాడు. ఆమధ్య యేదో దెబ్బలాటకేసులో యితనికి కైదుశిక్ష గూడ పడ్డట్టున్నది. ఏమేమైనపు యేలాఅయితే మనకేమి. ఈతని తోకలసి మాటాటి వున్నఒకటిరెండు రోజులలోనైనా వీలయి

నమట్టుకు గుంజుతాను. ఆయనదగ్గిరకువెళ్ళి మీరువచ్చినారని చెప్పగానే మాఅమ్మాయిమొగం చాటంతఅయిందనిచెప్పు. ఇదుగో వస్తున్నాను. (నిష్క్రమింతురు.)



రంగము.

[మోహినిమందిరము. మోహిని, నరసింహపంతులు ప్రవేశము.]

మోహి—పంతులుగారూ! మీరు బందరునుంచేనా రావడం సాని మీాద ఎన్నాళ్ళకు దయవచ్చింది.

క. ఘనునింజూడగ గోరు చాతక మున్గా గాంక్షించు చక్రంబు చం
దునిజూడన్ గమకించుచుండును చకోరీ; రాజభావంబునన్
నినునావానసపక్షి చూడదలచున్ నీచిత్తమెట్లుండునో
మనమానందము నొందె మీాదుముఖ బింబంబిప్డుజూడంగదన్.

నర—మోహినీ! నీవు నామనస్సులో సదా యెల్లకాలము యెప్పుడూ అన్నివేళల మెలగుచునేయున్నావు. నీప్రతిబింబము నాకనులకు గట్టుకొనియేయున్నాను. ఆనాడు నీవు నాకు యిచ్చిన నీ "ఫొటోగ్రాఫ్" యెప్పుడూ దేవుడికి మల్లీ నాతలపుదిక్కున పెట్టుకుని చూచుకుంటూనేయుంటాను.

మోహి—ఎన్నైనాచెపుతారు. చెప్పడానికేమిలెండి. అప్పుడు మూడు రోజులూ ఆలాగడచిపోయినవి. ఇంక దానిజోలి మనకెందుకని పూరుకొనడానికి మీాచిత్తము ఒప్పుకున్నదిగాని నామనస్సు వుండబట్టుతుందా.

తే. గీ. మరల మిమ్ముజూచుభాగ్యంబు ధరణియందు
నాకునెప్పుడు చేకూరు నా యటంచు

సంతతము మీవిమలనామ చింతనంబు
సల్పుచును వేచియుంటిని సచ్చరిత్ర.

నర—నీవు నన్నిక్కడ యేలా స్మరించుతున్నావో నేను మావూళ్ళో నిన్ను ఆలాగే స్మరించుతున్నాను.

మోహి—అయ్యా! ఎందుకబద్ధమాడుతారు! అబద్ధమాడితే ఆడపిల్లలు పుట్టుతారట. నామీదదయవున్నవారైతే.

తే. గీ. భవ్యభవదీయక్షేమంబు బరగదెలుపు
కమ్మయొక్కటైన వ్రాయరా కరుణబూని
దానివీక్షించియైన మో దంబునంది
శాంతిబొందుదు గాదొకో స్వాంతమందు.

దయలేనికబురులు యెందుకుచెప్తారు?

నర—అమ్మమ్మా! అల్లాఅండానికి వీలుపడదు. వుత్తరము వ్రాయకపోవడం నాదిపొరబాటే. అందుకుక్షమించాలి నిన్నుజూతామని ప్రతిరోజూ అనుకుంటూనేవుంటాను. ఏరోజుకారోజే ప్రయాణమవుతూవున్నాను. కాని కొన్నివ్యవహారము చిక్కుల చేత రాలేకపోయినాను. ఇప్పటికి కొంచెం తీరుబడిఅయినది.

మోహి—పోనీలెండి యిప్పటికైనా మీసేవకురాలు మోహిని వున్నదని జ్ఞప్తికివచ్చినందుకు సంతోషపడుతున్నాను.

తే. గీ. స్వాతివర్షము యెప్పుడు వచ్చునో యని
వేచు, ముత్యపుచిప్పల విధముగాగ
వేచియుంటి మీరాకకై విమలహృదయ
కంటి మిమునేడు ధన్యత గంటినింక.

ఈసారి యేమైనాసరే. కొన్నాళ్ళు నాదగ్గిర మీరువుంటనేగాని నేను మిమ్ము మళ్ళీ మీవూరు వెళ్ళనీయను. మీరేమిచేసిననుసరే. ఆలాచేస్తే మాఅమ్మతో దెబ్బలాడియైనాసరే నేను మీవెంట వచ్చివేస్తాను. మీరు తీసుకొనివెళ్ళనంటే ఏనుయ్యో గొయ్యో చూచుకొంటాను. (ఇంచుక యూరకుండి) కాని, అడుగుదామనుకొని మఱచిపోయినాను. ఈమధ్య దొరతనమువారు మిమ్ము గోదావరీస్నానాలు చేయడానికి తీసుకొని వెళ్ళినారంటే. అదేమిటి.

నర—అబ్బబ్బా ! ఎంతమాటన్నావు. నేనంత కఠినచిత్తుడననుకొన్నావా యేమిటి. నిన్నుజూడకపోవడంచేత బెంగపుట్టి కొత్తగా కాపురానికి భార్యరాగా దానిగుణాలు మంచివికావని వంకపెట్టి పుట్టినింటికి తోలేసి నీదగ్గరకు వచ్చినాను.

మోహి—నిజంగా మీరంతపని చేసేవుంటారు. సరే మీకు భోజనము నకు పొద్దెక్కుచున్నది. మీతో ఒక్కకుర్రవానిని పంపుతాను వాడు మీకు యిక్కడ దగ్గిరలోనేవున్న దక్షిణాదిహోటలు చూపిస్తాడు. అక్కడ భోజనంచేసి పడకకిక్కడికేరండి.

నర—దక్షిణాదిహోటలు అనగా క్రిష్ణమయ్యరుదేనా.

మోహి—అవును. అక్కడభోజనం బాగానేవుంటుంది.

నర—బాగానేవుంటుందిగాని యీమధ్య అందులో యేదో గడిబిడ జరిగిందట. ఎవరో వెధవముండయున్నూ కూతురున్నూ అక్కడకువచ్చి భోంచేసి పడుకుంటే హోటేల్లోనాళ్ళు నెవరో అర్థరాత్రి దీపమార్పి మీదపడ్డారటయేమిటి? ఈసంగతి చాలా మంది చెప్పుకున్నారులే?

మోహి—ఏదో కుర్రతనపుచేష్టలు. ఎవ్వడో చేసినాడు. తరువాత పోలీసువారు వీపుశుద్ధిచేసి వదలివేసినారు. ఆవూసు మనకెం

దును. మీరు భోజనంచేసిరండి. మీతో కురవ్రాడిని పంపు
తాను. దయచేయండి.

నర—మంచిది. (నిష్క్రమింతురు.)

రంగము.

[కొండయ్యనాయుఁడు ప్రవేశము.]

కొండ—(తనలో) ఆమంగలిలంజకొడుకు నాకెంతపరాభవం చేసినాడు సాధారణంగా ఎప్పుడయినా ఏమంగలివాడైనా యీలాచేసి నాడా. ఈమంగలివాడు ప్రతిదినము 'బాబూనాచేత నెప్పుడూ పనిచేయించుకోరు. ఈవాళ నాపనివాడితనం చూడండి' అని చెప్పితే పోనీగదా పాపము అని తలంచి పనిచేయించుకొనే టప్పటికి మీసములురెండు తెగగొటిగినాడు. ఇదేమిరాఅంటే బాబూ పొరపాటుఅని పాదాలమీదబడ్డాడు. నామీసం పో యినతరువాత వాడిని ఏమిచేస్తే ఏంలాభముంది. ఆలోచించగా ఆమంగలవాడు తాను బుద్ధిపూర్వకంగా యిదిచేసినట్లు తోచ డంలేదు. ఆవెంకటేశ్వరరావే నామీదవున్న కోపంచేత మంగ లివాడికి యెంతోకొంతడబ్బుయిచ్చి యీపనిచేయించినాడు. ఇది నిశ్చయం. అందుకనే యీవేళవుదయం వాడు నన్నుజూచి సకిలించడం దగ్గడం మొదలుపెట్టినాడు. అన్నా గాడిదకొడుకు యెంతపనిచేసినాడు. దీనికి వీడికిదగిన శాస్తియేదైనా చేస్తేనే గాని కార్యంలేదు. దీనికేమిప్రతీకార మాలోచించను? ఇందు లకుదగినపని మోహినిచేతనే చేయించవలయును. ఆముండచే తిలో వాడు కీలుబొమ్మవంటివాడు. అది చేయఁదలఁచుకొన్న దంటె యెంతపనియైనా చేయగలదు. (ఎదుటచూచి) అదుగో, అనుకొన్నంతలోనే వస్తున్నది.

మోహి—ఏమండోయి నాయుడుగారూ. ఈవాళ ఒంటరిగాకూర్చుని ఆలోచిస్తున్నారు. ఇదేమిటి! మొఖమిల్లాగున్నది? చిన్న బోయిందే అయ్యో! మీసం తీయించినారేమిటండీ? అబ్బే! బాగులేదు. మొఖమంతా బోడవులుగావున్నది.

ఉ. పున్నమనాటిరేయి పరి ꣸ పూర్ణసుధాకరు బోలుమోము; నా
కన్నులకేదొ తీరుగను ꣸ గన్పడుచున్నది హేతువేమొ; యీ
విన్నదనంబు గూర్చుటకు ꣸ బృథ్విని గారణమెవ్వరయ్య సం
పన్నగుణాఢ్య యిప్పుడను ꣸ మానము బాసి వచింపుమీవెసన్.

కొండ—మోహినీ! ఇకనుంచి నేను మీయింటికిరాను. నీకు నామీద యెక్కువప్రేమయని కనిపెట్టి యీవెంకటేశ్వరగాడు యెంతపని జేసినాడో చూచినావా. కొంటెతొత్తుకొడుకు!

మోహి—అయన మిమ్మల్ని ఏమిచేసినాడేమిటి?

కొండ—ఇంకేంచేయవలయును. చేయవలసినదే చేసినాడు. మంగలి వెథవకాళ్ళుపట్టుకొని నామీసాలు గొరిగించినాడు.

మోహి—ఆయన అంతపనిచేస్తాడండీ. చాలాపెద్దమనిషే. అయినను ఆయనకు మీకు విరోధమేమున్నది?

కొండ—అంతాపెద్దమనుష్యులే. కానివారెవరు. ఈమధ్య రామన్న పంతులికి అతనికిన్ని నేనేతగాదాపెట్టినాననిన్నీ, నీకు నామీద ప్రేమయెక్కువయనిన్నీ తలచి యీవిధంగా చేసినాడు.

మోహి—ఇది నిశ్చయమేనా. నిశ్చయమైతే యేదైనా ప్రతీకారము చేయవచ్చును.

కొండ—ఇందుకు నీవు దగిన ప్రతీకారము చేయకపోయినయెడల నీగడపతొక్కితే మాతృద్రోహముచేసినట్లే. నాకు పరాభవంకలిగితే నీకు కలిగినట్టుగాదూ.

మోహి—ఇది నిశ్చయమని మీరు చెప్పగలరా?

కొండ—ఇంకసందేహమెందుకు? ఈవాళప్రొద్దున్న వాడు కాఫీహోటలులో కనపడి "మీసా లెవరుగొరిగివేసినారండీ" అని వేళాకోళమాడినాడు.

మోహి—అందుకనేకామోసు యింతకుముందే నాదగ్గిరకువచ్చి కొండయ్యనాయుడు మీసాలజోరు అణిగిందిఅన్నాడు. అన్నా మీపట్ల యెంతపనిచేసినాడు. బ్రాహ్మడైతే అయినాడు దీనికి ప్రతి సేయవలసినదేగాని, చాలారోజులనుంచి నన్ను పోషిస్తున్నాడు. ఏలాచేయుదునాయని సందేహం కలుగుచున్నది. తినేతినే కూట్లో దుమ్ముకొట్టుకోనా?

కొండ—మోహినీ! పలుమాటలేల! ఈవిషయంలో ఎంతఖర్చుపెట్టమన్నా పెట్టుతాను. వాడు నాకు మీసంగొరిగించినందులకు నీవు వాడితల గొరిగిస్తివా! ఇకచెప్పనా నాసంతోషము?

మోహి—(తనలో)

తే. గీ ఎన్నిదినములనుండియో ♦ యెపుడుదగిన
కాలమరుదెంచునా యంచు ♦ గాచియుండ
నేటికిటుగూర్చె దైవంబు ♦ వాటముగను
ధనమునెల్లెన గ్రహించి ♦ తనరవలయు.

ఈయనదగ్గిర డబ్బులాగేసమయం దొరికింది. తరుణం మించిపోతే లాభములేదు. (ప్రకాశముగా) నాయుడుగారూ. వెంకటేశ్వరరావుగారు నాకు కావలసినంతధనమిస్తున్నప్పటికి, మీమీదవుండే మోజు విడువలేక మీకాయన అపకారముచేసినాడనే కోపంచేత యీపనిచేయడానికి పూనుకున్నాను. ఇందులో మాఅమ్మసాయముకూడా నాకు సంపూర్తిగా కావలసియున్నది. దానిముందు ఏదైనపడేస్తేనేగాని, అ

డి "ఊఁ" అందు. కాబట్టి మీబంగారపుగొలుసు నాచేతికియ్యండి. ఇది నాయుడుగారిచ్చినారేయని దానితో చెప్పి కార్యసాధనం చేస్తారు. వస్తువివిషయమై మీరు భయపడవద్దు. కావలెనంటే మీకు మళ్ళీ చూపిస్తాను లెండి.

కొండ—నీయందు నాకెప్పుడయినా అపనమ్మకంవుందా. అలాటిది వుంటే నీతో స్నేహంచేస్తానా. ఇదిగో గొలుసు (ఇచ్చి) ఆవెధవకు జుట్టే గొటిగించాలిసుమా!

మోహి—మీరేసూస్తారుకదా! రండు,

(నిష్క్రమింతురు)



రంగము.

[మోహిని, మీనాక్షి ప్రవేశము.]

మీనా—అమ్మాయీ! యీవాళ నీకు బందరులో మొన్నటికన్నెరికంపెట్టిన నరసింహాంపంతులుగారిని రమ్మన్నావుకదా. వెంకటేశ్వరరావుగారిని యేమిచేస్తావు.

తే. గీ. పంపుదును నాటకమటంచు ♦ వంకబెట్టి
గాకయుండిన వేరొండు ♦ గానిపించు
దారులకు నేమితక్కువ ♦ తల్లి వినుము
వలసినవి బోధచేసియే ♦ వంలితీవు.

(తెరలో మోహినీ.)

మీనా—వెంకటేశ్వరరావుగారు వస్తున్నారే.

మోహి—క్షౌరమహాత్మ్యవకార్య మాయున కెప్పుడుచేస్తే అప్పుడు కొండయ్యనాయుడుగొలుసు మనకు దక్కినట్లే.

మీనా.—నీకు గర్భంగూడా నిలిచింది అక్కయ్యలంతా జబ్బుగావు న్నారు. నెలలునిండకమునుపే డబ్బుజాగ్రత్తబెట్టుకొనవలెను.

[వెంకటేశ్వరరావు ప్రవేశము.]

వెంక.—(తనలో) వీళ్ళుగుసగుస లేమిటో.

మోహి.—(వెంకటేశ్వరరావును చూడనట్టుగా) వెంకటేశ్వరరావుగారి హృదయము మాభారీది. నవనీతమువంటిది. ఆయన్ను చూస్తే నాపంచప్రాణములు లేచివచ్చినట్లుంటవి. నేనాయనతో కొంచెంసేపు మాట్లాడుతానుగాని నీవువెళ్ళు.

(మీనాక్షి నిష్క్రమించును.)

వెంక.—(తనలో) ఈమోహిని యెప్పుడుచూచినా నాసంగతేమాట్లాడుతూవుంటుంది. నాయందు మిక్కిలి యనురాగము. వేశ్యలలో యిట్టివాళ్ళు. యెక్కడనోగాని వుండరు.

మోహి.—పంతులుగారూ యిట్లాదయచేయండి. తాంబూలంయీవేళ మాబాగావేసేరే. ఎక్కడనైనా బేరం, గీరం యేమైనా తగిలిందాయేమిటి?

వెంక.—రామ రామ. ఎప్పుడూ అట్లాటిమాటలాడకు. నిక్షేపపు కుప్పవు నీవుండగా మరొకళ్ళెందుకు ?

మోహి.—ఈవాళ నాటకానికెళ్ళే ప్రయత్నంలో వున్నట్టున్నారే.

వెంక.—చంద్రయ్య చంపుకుతింటున్నాడే.

మోహి.—మీకేమీ వేషములేదుకదా.

వెంక.—వుంటే నీతో చెప్పనా.

మోహి.—అయితే యీవాళ నాటకంలోకి వెళ్లుతారన్నమాటే.

వెంక.—ఏమో కాస్సేపు కూర్చునివస్తాను.

మోహి.—అర్ధరాత్రిమాత్రమువచ్చితలుపుకొట్టకండి. మిమ్మల్ని నాట

కంలోనికి వెళ్లకుండా చేదామనుకొన్నానుగాని నాకు జ్వరం తలనొప్పిగావున్నది. అందుచేత వదలుతున్నాను.

వెంక—మంచిదే.

మోహి—అన్నట్టు మీతో చెప్పడం మఱచిపోయినాను. ఎన్నాళ్ళబట్టో చెప్పుదామనుకుంటాను. ఎప్పటికప్పుడే మఱచిపోతుంటాను.

వెంక—ఏమిటది.

మోహి—ఏమిటదా? ఈపిచ్చిజుట్టు ఏమిటి? ఇదివుంచుకుంటే ఇంక మాయింటికి రాకండి. పురాతనపద్ధతి యింకా మీరు వదలలేదుకదా. కొత్త మోస్తరు అవలంబించాలి.

వెంక—ఏమిటే? ఆకొత్త మోస్తరు అదేదో చెప్పు, నీవేలా చెప్పితే ఆలా చేస్తాను.

మోహి—చూడండి. ఈకాలము యేలావుందంటే.

తే. గీ. జుట్టు సకలంబు గొఱిగించి శోభగాంచు
నట్టి కాప్రింగు బెట్టుక యలరవలయు
దొరలరీతిని; నయ్యదే సరసులెల్ల
బాగడుచున్నట్టిమార్గంబు భూసురేంద్ర.

కాలిమడమలవరకును గోచిచెంగు వ్రేలాడుచుండవలయును. బూట్సుకాళ్ళతో నడుస్తుంటే భూమిమీద "ధిమ్" "ధిమ్" అనే మోత మోగియవలెను. ఇల్లాటి వనేకములున్నవి. ఇన్నిటికంటే గ్రహించవలసినది యింకొక్కటివున్నది. ఎవరన్నా నమస్కారమంటే "గుడ్ మార్నింగు" అనవలెను. ఇంతకు ముఖ్యముగా యిప్పుడు నేను చెప్పేదియేమంటే నాకు మీజుట్టు పనికిరాదు. బంగాళాక్రాపింగ్ చేయించుకొనవలెను. అల్లాగయితేనేగాని నేను మీతో వుండను.

వెంక—అబ్బా. నన్ను చంపేస్తున్నావే. నీకు నేను యేలావుండాలని వుంటే ఆలాకానియ్యి.

మోహి—అల్లాగయితే యిప్పుడే మంగలివాడిని మాచంద్రియ్యచేత పిలిపిస్తాను.

వెంక—ఇప్పుడేనా మిట్టమధ్యాన్నం క్షవరం చేయించుకొంటారా! వేళా పాళా లేదూ?

మోహి—క్షవరానికి వేళేమిటి ? నాటకాల్లో వేషాలువేసేటప్పుడు రాత్రిళ్ళు చేయించుకోవడం లేదా ?

వెంక—అబ్బా! నీవుమా చెడ్డదానవే. నీయిష్టంవచ్చినట్టు కానియ్యి. అయితే ఒకందుకు భయపడుతున్నాను. నేను వైదికివెధవ ముండాకొడుకునుగదా—

(అర్థోక్తి)

మోహి—అదేమిటి! వెధవముండాకొడుకునని చెప్పుకుంటూవున్నారు మీతండ్రిగారు చచ్చినతరువాత మీరు పుట్టినారా యేమిటి ?

వెంక—ఏంసరసాలాడుతావే? మాటవరుసకన్నాను. నీతో స్నేహం చేసినందుకు నా కిడిగూడా తెచ్చిపెట్టుతున్నావు ?

మోహి—సరసానికంటే కోపపడుతారేమిటి? సరేదానికేమి! మీరు చెప్పవచ్చినమాటయేమిటి?

వెంక—మరేంలేదుగాని వైదికవాడిని. బోడిగుండుచేయిస్తే అంతా "నీయమ్మకడుపుకాలా! ఇదేంపొయ్యేకాలం అంటారేమో." యని భయపడుతున్నాను.

మోహి—ఇల్లాటిభయముంటే మీరేంనెగ్గగలరు. కాకపోయినా మీ మొగానికి జుట్టు చాలా బేడవులుగావున్నది. చక్కగా క్రాపింగు చేయించుకొని "కేశరంజన్" నూనె వ్రాసుకొని పెడపాపిడి తీసుకుంటే జగన్మోహన కృష్ణమూర్తికిమల్లే వుంటారు.

వెంక — ఈశరీరం నీయాధీనంచేసినాను. నీకెల్లాయిష్టమయితే అల్లా చేసుకోవే.

మోహి — (తెరప్రక్కజూచి) చంద్రియ్యా! పంతులుగారు క్షవరం చేయించుకొంటారట కాని మంచిమంగలివాడిని తీసుకొనిరా. కత్తిరించడానికయితే ఆలస్యమవుతుందిగాన మిషనుతో కత్తిరి వేయగలిగినవాడిని తీసుకొనిరా.

[తెరలో]

ఇదిగో తీసికొనివస్తాను.

[మంగలివాడు ప్రవేశము]

మంగ — (వెంకటేశ్వరరావుగారిని జూచి) పంతులుగారూ! దండాలండి!

వెంక — ఇల్లారారా! ఇక్కడకూర్చొని పనిచెయ్యరా! తొందరగా వెళ్ళవలెను.

మంగ — చిత్తంబాబయ్యా (అని పొదివిప్పి కత్తినూరి పనిచేయుచున్నాడు.)

మోహి — ఓరబ్బి! ఈయనకు బంగాళాక్రాపింగుచెయ్యి.

మంగ — అదేచేయబోవుచున్నాను. బాబూ (అనిచేయును)

వెంక — అరరే! మఱచిపోయితిని. మోహినీ! నేను పొరబాటుబడితిని ఈమధ్య నాకు వంట్లో జబ్బుచేసినప్పుడు మావాళ్ళు నాజుట్టు తిరుపతిదేవుడు కిస్తామని మొక్కుకున్నారు. ఆకారణంచేతనే యీమధ్య పనియే చేయించుకోవడంలేదు, అయ్యో! ఇంటికెళ్ళితే మావాళ్ళు మొఖంవాచేటట్లు చీవాట్లు పెట్టుతారే.

మోహి — అయ్యో! పరవాలేదు. ఈజుట్టుజాగ్రత్తగా నేనుదాచియుంచుతాను. మీరు తిరుపతికి వెళ్ళినప్పుడు దీనిని దేవుడికీయవచ్చును.

ఇదికూడ ఒకఆచారమై యున్నదికదా? కాబట్టి యీగొటిగిన జుట్టు తీసుకొనివెళ్ళి మీవాళ్ళకు చూపించండి.

వెంక—సరే. నీయిష్టము. మంగలాడికి డబ్బులిచ్చి పంపివేయి. తరువాత నేను నీకు యిస్తానులే.

మోహి—సరే బాగానేవున్నది. మీకు తెలియనిడబ్బులు నాయొద్ద నెక్కడనుండును. ఇందాక రెండణాలుంటే దాసీఅసిరికి యిచ్చి మార్కెట్టుకు పంపినాను.

వెంక—చూడవే. ఎక్కడన్నా వుంటాయి.

మోహి—బాగానేవున్నది. లేదనిచెప్పుతుంటే. పోనీలేండి. మీజేబులో యేమన్నావున్నాయేమో చూస్తాను. (చిలకకొయ్యనున్న కోటుజేబులు చూచుచున్నది.)

వెం—అదుగో! అదుగో!! అస్తమానము ఏదోఒకటి తడుముతూనే యుంటావు. నాకోటుముట్టుకోకు. అదిముట్టుకుంటేనన్నుచంపుకుతిన్నట్టే.

మోహి—ఈవోట్టుకేమిలెండి! ఇది మనకుగ్గుపాలుతో, బెట్టిందే. ఓశబ్బో! ఒట్టేసుకున్నతంమాత్రిన మాంతాననుకొన్నారా యేమిటి? ఇంతమాత్రిం నాకుస్వతంత్రిం లేదా? (కోటుజేబుచూచి) అమ్మబాబో! యెంతదొంగలండి. ఎంతటక్కరు. అమ్మా, అమ్మా. ఈనవర్సు యెక్కడిదండీ.

వెంక—నీకంటపడ్డదీ? ఇంక బ్రితుకనియ్యావు. అది అక్కడపెట్టుదు! చుట్టలుసిగరెట్లు వాడినవాడికి యియ్యాలి.

మోహి—దానికేంలెండి. ఇది నానానులో వేసుకుంటాను చుట్టలువాడికి మీరిచ్చుకోండి.

వెంక—లాగేశావు? కాని, మళ్ళీనేను తంటాలుపడాలి, సరేఆమంగలి వాడికి డబ్బిచ్చి పంపు. తరువాత చూచుకొందాము. నేనింటికి వెళ్లి భోజనంచేసి నాటకంలోకిపోతాను.

(నిష్క్రమించును)

మోహి—(తనలో) భళా ! ఎట్లో మాయలోబడవేసి యీతనిజుట్టు గొరిగించివాను. ఈసంగతి కొండయ్యానాయుడుతో చెప్పినా నంటే సంతోషించి యింకాయేమయినా నాకిచ్చును. (మంగలినిజూచి) అబ్బీ. నీకుడబ్బిస్తానురా.

(నిష్క్రమించును)



7/61

రంగము.

[మోహిని, కొండయ్యానాయుడు ప్రవేశము]

కొండ—మోహినీ! నీవుమా చెడ్డఅసాధ్యురాలవు, ఆవెంకటేశ్వరరావు గాడి జుట్టు యేలాగొరిగేశావేమిటి?

మోహి—అబ్బా! దానికెంత కష్టపడ్డాననుకొన్నారేమిటి?

తే. గీ. నాకు మీయందునున్నట్టి నవ్యప్రేమ
యింతకార్యంబు జేయించె నిపుడు కాని
మీరొసంగిన ధనముకై మిగులయాస
పడితినంచెంచబోకుడు భావమందు.

వెంకటేశ్వరరావు పంతుగారు నాకేదికావలసిన నదితెచ్చియిచ్చుచు నన్ననన్నివిధముల బోషించుచుండినను నాకు మీయందున్నయనురాగంబును బాయలేక ఆపెద్దమనిషి కింతపరాభవముగూర్చినాను.

కొండ—మోహినీ! నీసంగతినాకుదెలియదా? వెధవడబ్బుకునీవాసపడుతావని యెన్నడయినా అనుకుంటానా? ఎంతమాట. ఆవెంక

శ్వేశ్వరుడు నాకు జేసిన పరాభవమునకు మారుపరాభవం జరుగునట్లు బుద్ధిగౌరిగించినావు. నీఋణ మెల్లాతీర్చుకుంటాను? ఒక్కముద్దు పెట్టుకుంటాను. ఇల్లారా ! ఆలోచిస్తావేమిటి. త్వరగా రా.

మోహి.—అబ్బా! ఎంతకష్టపడుతారు.

తే. గీ. సకలచింతల బోగొట్టి ప్రకటితముగ
మదికి నానందమునుగూర్చు పణ్యకాంత
ముద్దు కాసపడనగునె పుడమియందు
ధనములేకుండ తమవంటి ధనికులిట్లు.

కొండ.—ఓహో! దీనికిఖరీదుకూడానాయేమిటి. అయితేమొత్త ఏమాత్రమేమిటి?

మోహి.—దీనికెక్కడకిఎవరియనుగ్రహంవారిది. వెంకటేశ్వరరావుగారిని చూడండి. ముద్దుబెట్టుకున్నప్పుడల్లా నవరసాయిస్తారు. పంతానికైనా మీరాయనతో సమానంగా యియ్యగలరా ?

కొండ.—పీనుగులుమోసేవెధవకూ నాకూ సాటితెస్తున్నావు ? చాలు చాలు ! !

మోహి.—ఏమండీ! నాయుడుగారూ. మీవేళ్లివుంగరాలు బహు తమాషాగావున్నాయి. నాచేతికిపెట్టుకుంటే ఏలావుంటాయో చూస్తాను. (వుంగరాలుతీసికొని తనవేళ్ళకుబెట్టుకొని) నాయుడుగారూ. మహబాగావున్నాయి. ఇవి మాఅమ్మకు చూపెట్టి తమాషాకు మీరిచ్చారని చెప్పుతాను ఏమంటుందో చూతాము.

కొండ.—అవును, అల్లాచెప్పితే మీఅమ్మకునామీదమరీప్రేమవస్తుంది.

మోహి.—ఏమండీ! అడగడం మఱచిపోయినాను. మాపెద్దక్కయ్య

చిన్న అక్కయ్యల విషయమై మీరు తగినంతశ్రద్ధ పుచ్చుకొనడంలేదు. లేకుంటే ఈపాటికి వారిరోగములు కుదరకుండా వుంటాయా?

కొండ—నీవల్లా అనుకుంటున్నావుగాని నాశ్రమ భగవంతునికి తెలియవలయును. అష్టకష్టాలుపడుతున్నాను. అవిజీర్ణించిపోయినరోగాలవ్వుటచేత యింతశ్రమ పడవలసివచ్చింది. లేకపోతేయీపాటికి మీయక్కయ్యవంటిమీదనువ్వ మేఘురణాలు తుప్పురాలిపోయినట్లు రాలకుండా వుండునా. అయినను యిప్పుడు మించినది యేమీలేదు. రేపుగాని యెల్లుండిగాని సౌవీరము శుద్ధిచేసి ప్రయోగించి యారోగమును డుల్లగొట్టివేస్తాను. దానిమూలమున సంతానం కలగదని నేను భయంపడుతున్నాను.

మోహి—అయ్యో.

తే. గీ. భవ్యసంతానమున కేమి । బ్రతుకనిందు
బలుసుకూరను దినియైన । బ్రతుకవచ్చు
కమలనేత్రల సకలరో । గముల బాపి
మాగృహంబును నిలఁబెట్టు । మాన్యచరిత.

కొండ—నీవు నన్నింతగా వేడవలెనా? నేనీకష్టపడడం యెవ్వరికోసం?

తే. గీ. పవలు రేయియు ననకుండ । మందులిచ్చి
సాకుచున్నాను; కానవా । శ్రమలఁబడుచు
రమణి; నీపైఁగలుగు నను । రాగమహిమ
యింతసేయుచునుండె వే । యేల వినుమ.

అయినా నీకోసం నేనుపడుచున్న కష్టాలన్నీ నాకు సుఖాలే.

మోహి—అయ్యో. మీసంగతి నాకు తెలియదా. ఏదోదయవుంచి

పెండ్లాము దానిరోగం కుదర్చండి. నేను మరెందుకు చెప్పడం లేదు. కాని సంపాదించదగినవాళ్ళిద్దరూ అల్లావున్నారు. ఇంక నాసంగతి మీరు చూస్తున్నారుకదా.

కొండ—అవును. నీవు నేడో రేపో నీళ్ళాడుటకు సిద్ధముగావున్నావు. సరే. ఈసంగతి కాలోచింపనేల. మంచిసాపీరము ప్రయోగించి వాళ్ళరోగాలు మాడ్చివేస్తాను. సంతానముమాటకేమిలే. వేశ్యలకు సాధారణముగా సంతానం కలుగుచునేయుండదు. వాళ్లు పిల్లను కొనుక్కొని తెచ్చుకోవడమేకదా!

మోహి—నాయుడుగారూ! మీకు తెలియనిదేమున్నది.

కొండ—ఇంకనాకు భోజనంవేళయైనది. నేపోవలెను.

మోహి—నేనూ వెళ్లాలి.

(ఇరువురు నిష్క్రమింతురు.)



రంగము - సత్రము.

[వెంకటాచార్యులుగారు, చూడమ్మ, తిరువెంగళమ్మ ప్రవేశము.]

వెంక—ఒసే. భగవంతుడిదయవల్ల యీసత్రంలో వండుకుతినడానికి గదిమాత్రం దొరికింది. ఏమిపిల్లా! ఈసత్రం నిత్యకళ్యాణం పచ్చతోరణంలాగున్నది.

చూడ—మీతోకబుర్లుచెప్పుతూ కూర్చుంటే యెల్లాగు? త్వరగా వంటచేసుకొని భోజనంచేదాము.

తిరు—నాన్నా ఈవాళ మనము యీపూళ్ళోవుండి పూరంతాచూచి పోదాము.

వెంక—అల్లాగే. ఇంటికాడ మనకు మించిపోయిందేమున్నది.

చూడ—నేను స్నానానికి వెళ్ళుతున్నాను. (నిష్క్రమించును)

తిరు—నాన్నా అదేమిటి? తిప్పగానేనీళ్ళువస్తున్నాయి!

వెంక—అమ్మా! నీవెప్పుడో చిన్నన ప్పుడు యీవూరువచ్చినావు. బుద్ధి తెలిసినతరువాత రాలేదు. అది కుళాయిఅంటారు. అమ్మా. నూతులలోనుంచి తోడుకొని కష్టపడకుండా చల్లగారక్షించే యింగ్లీషుదొరతనపువారు యిది యేర్పాటుచేసినారు.

తిరు—మనవూళ్ళో యిల్లాటివి యెందుకు పెట్టరు.

వెంక—మనవూరుసంగతే చెప్పు. వెధవపల్లెటూరు. (ఇంచుకయుండి) నేను దొడ్లోకి వెళ్లివస్తానుగాని జాగ్రత్తగా సామానుచూస్తూ వుండు. (నిష్క్రమించును)

సుబ్బరామయ్య—(ప్రవేశించి తనలో) అబ్బా! ఏమిజనము. వీళ్ళంతా మంగళగిరి వుత్సవానికి వెళ్ళవచ్చినవాళ్ళే కాబోలు. చాలా రకాలుదిగినాయి. (ముందుకునడచి) ఇదిగో! ఈ "రూమ్" లో యెవరోవున్నారే. (తిరువెంగళమ్మనుజూచి) ఇదియేదో "అన్ క్లయిమ్డ్ ప్రాపర్టీ" అబ్బా! యేమిబ్యూటీ"విడోఅయితేనేమి! ఈయందాని కీడయినవా ళ్లెక్కడాలేరు. "దిస్ఇజ్ వైష్ణవ బ్యూటి" ఈరకంసంగతి యేలావుంటుందో కాస్త పలకరించి చూదాము. (ప్రకాశముగా) అమ్మా మందియేవూరు.

తిరు—వెంకటాపురము.

సుబ్బ—వెంకటాపురమా మీది! ఎక్కడికివెళ్లుతున్నారు?

తిరు—మంగళగిరి వుత్సవానికివెళ్లి వస్తున్నాము. మావూరు వెళ్ళి పోతాము.

సుబ్బ—ఈవాళ వెళ్లుతారా? రేపువెళ్ళుతారా?

తిరు—బహుశః ఈవాళ వుంటాము.

సుబ్బ—ఎవరెవరు వచ్చినారండి?

తిరు—నేను, మానాన్న, మాఅమ్మ.

సుబ్బ—మిమ్మల్ని నేను వెంకటాపురంలో చూచివానులెండి. అందుచే తనే యింతచనువుగా అడుగుతున్నాను. మఱచిపోయినాను. మీనాన్నగారిపేరు యెవరండి.

తిరు—వెంకటాచార్యులుగారు.

సుబ్బ—చెప్పరూ మీరు వెంకటాచార్యులగారి కొమార్తెలా! ఆయన మాకు చాలాస్నేహితులు. ఇదేమిటి మీరు యిల్లావున్నారు. నేను వెనక మీవూరువచ్చినప్పుడు కలకలలాడుతూవుండేవారు

తిరు—(తలవంచుకొనుచున్నది.)

సుబ్బ—చెప్పనక్కరలేదులెండి. సంగతితెలుసుకున్నాను. అన్నా పాపము. ఎంతకష్టము సంభవించినది. ఆవెధవదేవుడు ఎట్లాటి వాళ్ళకు కష్టాలు తెస్తాడండి! (తనలో) నిమ్మళంగా దీనిని వడుపు వేయాలి. అదిగో ఈవిడతండ్రి కాబోలు వస్తున్నాడు. బాగా ఎఱిగినట్లు ఈయనతో మాట్లాడవలెను.

వెంక—(ప్రవేశించును)

సుబ్బ—ఏమండోయి! ఆచార్యులుగారూ. నమోనమః!!

వెంక—అమ్మమ్మా! ఎంతమాట!! ఎంతమాట!!! దయచేయండి.

(ఇద్దరును కూర్చుందురు.)

సుబ్బ—జ్ఞాపకమున్నదా?

వెంక—అయ్యా. క్షమించండి మరచిపోయినాను. దయచేసి జ్ఞప్తికి తెత్తురా?

సుబ్బ—నేననుకొన్నట్లే చేసినారు. విశాఖండానికి రివిన్యూయినస్పెక్టరు చేశారే! ఆకామశాస్త్రిగారికి మేనల్లుడిని. నాపేరు సుబ్బరామయ్యఅంటారు.

వెంక—నేను యింకా యెవరోఅనుకుంటున్నాను! కామశాస్త్రిగారి మేనల్లుడవా? ఆయనకూ నాకు మహాస్నేహం. పాపము! ఆ సంగతి యిప్పుడు తలంచుకొంటే యేడుపువస్తుందిగాని మాఅ మ్మాయి పెళ్లికి ఆయన యెంతసహాయి చేయించాడనుకున్నా రు నాయనా, నీవేమిపనిచేస్తున్నావు.

సుబ్బ—నేనా! "అనెంప్లాయిడ్ కమిటీ" కి సెక్రిటరీగావున్నాను.

వెంక—బుద్ధిమంతుడవు. మకాం యీవూళ్లోనేనా ?

సుబ్బ—ఈవూళ్లోనేనండి. తీర్థపుఅడావిడి గాదండి? ప్రిజ చాలామంది యీసత్రింలోకి వస్తుంటారు. తమబోటిపెద్దమనుష్యులు ఆడవాళ్ళతోవస్తే "రౌడీస్" అనగా పోఖరీలుచేరి అల్లరి చేస్తారు. అల్లాటిఅల్లరులు జరుగకుండా కనిపెట్టడంకోసం వచ్చినాను.

వెంక—అబ్బా! ఈసత్రంలో మాఅల్లరులు జరుగుతాయే!

సుబ్బ—జరుగుతాయికాని మీకేంభయము లేదులెండి. నేనులేనూ. మనపేరుచెప్పితే హడలు!! రౌడీస్అంతా కచ్చుల్లో మూత్రిం విడుచుకుంటారు. గుఱ్ఱమైనా నీళ్ళు తాగదు. ఫిరంగిమైనా పేలదు.

వెంక—నీవుండగా మా కేమిభయము (భార్యనుబిలచి) ఏమే వంటయిందా ?

చూడ—అయింది స్నానం చేయవచ్చును.

వెంక—(సుబ్బరామయ్యను జూచి) బాబూ నేను స్నానానికిలేస్తాను. మనము మళ్లీ భోంచేసి కలుసుకుందాము.

సుబ్బ—మీకు భోజనానికి పొద్దుపోయింది. వెళ్ళరండి. మాకేం పొద్దున్నే "ఉపమా, ఇడ్డెన్, కాఫీ" మెక్కినవాళ్ళము.

వెంక—(నవ్వుచు నిష్క్రమించును.)

సుబ్బ—(తనలో) ఈ అమ్మాయితల్లి లోపల వంటచేస్తున్నది. తండ్రి స్నానం చెయ్యడానికి వెళ్ళినాడు. ఈలోపుగా ఈవిడవ్యాపారం కాస్త "యగ్జామిన్" చేతాము. ఒక్క కూనురాగందీసి "సైట్" చూపు కలుపుదాము. తరువాత యెల్లా వుంటుందో. అటునుంచి యిటునఱుక్కురమ్మన్నాడు.

ఓ విరిబోడీ తాళగ జాలనె యోర్వగ జాలనే ॥ ఓపరుబోడి ॥
భావము నిన్నెడ బాయగ జాలనె విరిబోడీ ॥
మృదమునను కో వెలలు గూయగ ।
రవములగు తుమ్మెదలు బల్ । రవములు జేసెనుగదె ।
రంగ డెఱుగును నాదువెతలు ॥ ఓవిరిబోడీ ॥
చల్లని వెన్నెలలో కల్లరి మారుడు ।
యుల్లము నెంతోరం జిల్లగ జేసెగదే ॥
నా వల్ల నేరము లున్న సైపుము ।
మల్లికా వలి గతియు యెల్లా ।
అల్లి బిల్లిగ నాదు ప్రియము ।
యుల్లమున నే కొల్లలాడెద ॥ ఓ విరిబోడీ ॥
కోపమ దేలనే కోమలి నే తాళనె ।
నే పగవాడనె నీ వెఱుగ వటె । నీప్రాపు గోరిన వాడనే నీ ।
దయకు పాత్రుడ గానటే । నాదుపై కృపఁజూప కున్నను ।
నీపదంబుల యాన నేటికి ॥ ఓ విరిబోడీ ॥ (అని పాడును.)

తిరు—(అదే పనిగా జూచును.)

సుబ్బ—(తనలో) బేష్. సంగీతమంటే ఈవిడకి చాలాయిష్టంలావుంది మళ్ళీ ఒకసారి విసరుదాం.

మ. "అతివా! దాపగనేల నిన్నలనీ నీ కత్యంత సంతాప దు
స్థితి జేకూర్చి మీరరాని సురసం దేశంబునన్ నేడు ని
న్నాతలం పెట్టగ నేగుదెంచిన మహా నిర్భాగ్యు డాపాపు డా
హితదూరం డవివేకి యానలుడు వీ డే సుమ్ము బింబాధరీ."

(చిత్రనళీయం అని పాడును.)

తిరు—ఇంకా మీరు భోజనానికి వెళ్ళలేదేమండి ?

సుబ్బ—ఏమిటోనండీ. ఎవళ్ళన్నా స్నేహితులు వస్తే వాళ్ళని వదలి
పెట్టి వెళ్ళ బుద్ధి వెయ్యదండి.

తిరు—ఏరీ! ఇక్కడ మీస్నేహితులు యెవ్వ రున్నారు.

సుబ్బ—మీరు నాస్నేహితులు కారా.

తిరు—(నవ్వుచున్నది.)

సుబ్బ—నవ్వుతారే. కారా యేమిటి. అవుతారా! కారా చెప్పండి.
చెప్పేదాకా మిమ్ములను వదలను.

తిరు—(మాట్లాడక యూరకుండును.)

సుబ్బ—మాట్లాడరే. నిరుత్తరం అంగీకారసూచకమేనా ?

తిరు—మీరు మాఅసాధ్యులండి. మీకు జవాబు చెప్పలేనండీ.

సుబ్బ—(తనలో) పరవాలేదు. మార్గంలోకి దింపగలుగుదు నన్నధై
ర్యం కలుగుచున్నది. (ప్రకాశముగా) ఈవాళ మీయింట్లో
యేమి వండుకున్నారండీ !

తిరు—బాటసారులుగా వచ్చి సత్రంలో దిగినవాళ్ళము. ఏమి వండు
కుంటాము. ఏమిటో మాఅమ్మ "కత్తారుక్కాయకూటు"న్నా
"పర్పామ" ధున్నా చేసింది.

సుబ్బ—ఇంక నేమికావాలి. ఈవాళ మీ యింటికి భోజనానికివస్తాను.

తిరు—శ్రీవైష్ణవు లింట్లో మీరెందుకు భోజనం చేస్తారు.

సుబ్బ—మీలో స్త్రీవైష్ణవులని పురుషవైష్ణవులని రెండు మతాలవా రున్నారా యేమిటి !

తిరు—సరే నేనోటంటే మీరోటంటారు. మతముపేరే శ్రీవైష్ణవ మంటారు.

సుబ్బ—అల్లాగునా. తెలిసింది. నేను ఎవరింట్లో పడితే వారింట్లోనే భోంచేస్తాను. నాకు మతం విషయమై పట్టుదల లేదు. నేను "సోషల్ రిఫార్మర్"ను. అనగా సంఘసంస్కర్తను.

తిరు—ఏమిటో మీ యింగ్లీషుమాటలు నాకు తెలియవు.

సుబ్బ—తెల్లవారి లేస్తే యెప్పుడు లెక్చర్లు అనగా వుపన్యాసాలు యిచ్చే అలవాటుచేత యెవ్వరితో మాట్లాడినా యిల్లాటిము క్కలే వస్తాయి. ఏదో మీవంటివారు మమ్మల్ని సర్దుకు రావాలి.

తిరు—ఉపన్యాసా లివ్వడ మెందుకండీ.

సుబ్బ—మీకు తెలియనే లేదా. దురదృష్టవంతులైన వితంతువ్వలకు పెండ్లిండ్లు చేయుమనియు, వేశ్యలలో వ్యభిచారవృత్తి మాని పించేసి వాళ్ళకుగూడ పెళ్ళిళ్ళు చేయించవలసినదనియు యుప న్యాసా లిస్తుంటాను.

తిరు—మీరు చాలా గొప్పపని చేస్తుంటారే.

సుబ్బ—నాబోటివాళ్ళు పుట్టబట్టే లోకం బాగుపడడం.

(లోపల)

అమ్మాయీ! నాన్న స్నానంచేసి వచ్చినారు లోపలికిరా.

తిరు—మావాళ్ళు పిలుస్తున్నారు. నేను వెళ్ళవలెను.

(నిష్క్రమించును.)

సుబ్బ—నాకూ భోజనంవేళ మైనది. (నిష్క్రమించును.)



రంగము.

[హోటలు-సుబ్బరామయ్య ప్రవేశము.]

సుబ్బ—(తనలో) ఎల్లాగో నాలుగు డాబుసరి కబురులు చెప్పి యీవి డిని తల్లిదండ్రుల నెడబాసి యీ హోటలుకు చేర్చినాను. కాని యిల్లాచేసినప్పటినుండి నా గుండెలు దడదడ కొట్టుకొను చున్నవి. ఏమి కొంప మునుగుతుందో యని భయము కలుగు చున్నది. నేను భయంగా వున్నట్టు దీనికి దెలిసిందంటే బేజా రెత్తుతుంది. కాబట్టి నేను ధైర్యంగా వుండవలెను.

తిరు—(ప్రవేశించి) ఏమండోయి సుబ్బరామయ్య పంతులుగారూ! ఏదో ఆలోచిస్తున్నారు. నాలుగు కబురులుచెప్పి నన్ను మీ వలలో పడేసి యిక్కడికి చేర్చినారు. ఇక్కడ వుండడం మన కేమీ బాగులేదు. వచ్చి పోయేవాళ్ళంతా యేక నాకేసి చూడడమే.

సుబ్బ—ఏడిశావులే వెధవలు గుండే చెరువా! నాపేరు చెప్పితే కుం కలు పారుకుంటారు.

తిరు—ఏదో కొంప మునిగేదాకా మీరు అల్లాగే కబురులు చెప్పు తుంటారు. నాకేమోగాని మిగుల భయము గలుగుచున్నది. ఇక్కడనుంచి బయలుదేరి యెక్కడికయినా పోదాము. ఇక్క డవుండడం చాలా అపాయకరంగా తోస్తుంది.

తే. గీ. నన్ను వంచించి యీరీతి ౯ నాదుతల్లి
దండ్రులను బాయగా జేసి ౯ తథ్యముగను
తోడుకొని వచ్చినారలు ౯ యోచకుండ
నేమి కీడు వాటిల్లునో ౯ యెరుగరాదు.

సుబ్బ—నేనుండగా నీ కేమిభయము. అంత మీదుమిక్కిలి వచ్చిం దంటే రెండో కంటివాడికి తెలియకుండా ఆకాశపథముమీద నుంచి తీసుకొనిపోతాను. నేనేం సామాన్యుడ ననుకొన్నా వా యేమిటి.

తిరు—మీరు యెంతటివాళ్ళో కాకపోతే నన్నీలాగున తీసుకొని వస్తారా!

సుబ్బ—"దట్ సిట్" నిజం చెప్పినావు.

తిరు—సరేకాని, నన్ను మీరు తీసుకొని వచ్చినతరువాత మానాన్న మాఅమ్మ నాకై యేమి ప్రయత్నము చేస్తున్నారో. లేకపో తే లేకపోయిందని వెంకటాపురము వెళ్ళిపోయినారో ఆసంగ తి కాస్త కనిపెట్టినారా లేదా.

సుబ్బ—నేనేం తెలివితక్కువవాడనా యేమిటి.

తిరు—నాకు భయమేమీ లేదు గాని నేను యిక్కడ వున్నానని తె లిస్తే యేమి చిక్కు వస్తుందో.

సుబ్బ—పాలాత్ముడికి తెలియదు. ఈ హోటలనగా ఏమనుకొన్నావు? మనవంటివాళ్ళకు విశ్రాంతి స్థలం.

[రమణప్ప ప్రవేశము.]

రమ—సుబ్బరామయ్య పంతులుగారూ! ఈవిడ మీ కేమవుతుం దండి.

సుబ్బ—మావాళ్లే. మావాళ్లు యీవూళ్లో వున్నారేమో అనుకొని వచ్చింది. లేకపోయినారు. అందుచేత యీపూటకు యిక్క డ భోజనంచేసి వెళ్ళిపోతానంటే సరే అని తీసుకొనివచ్చినాను.

రమ—నాయనా! నీమాట వకటీ నమ్మడానికి వల్లగాదు. అన్నీ అబ ద్ధాలే. అన్నీ డాబులే. ఏ డాబుసరికబురులో నాలుగుచెప్పి

యిల్లా తెస్తుంటావు. అయినా ఈవిడ నీ కేమయితే నా కెం దుకు. ఈపూట భోజనం అవడంతోనే యిక్కడనుంచి దయ చేయండి. ఇదేం గోలయో నాకు చాలా అనుమానంగావుంది. ఏదన్నా వస్తే నాకొంపమీద వస్తుంది. తరువాత ఎవడు పడ గలడు.

సుబ్బ—(తనలో) వీడికి నా వ్యాపారం తెలిసిందా యేమిటి? తెలియ డంచేతనే యిలా చెప్పుతున్నాడు. వీడావలిస్తే పేగులు లెఖ్ఖపె ట్టే వెధవ. ఇక్కడనుంచి పెందాళే మకాం యెత్తాలి. అల్లా చేస్తేనే బాగా వుంటుంది. (ప్రకాశముగా) ఏమయ్యా రమణ ప్పగారూ! బొత్తిగా నామర్దామాట లాడుతావు. పిన్న పెద్ద తారతమ్యం అక్కరలేదా యేమిటి? నాసంగతి తెలిసివుండే అనుమానపడతా వేమిట? కపట్ దార్.

రమ—అయ్యా! మీకూనాకూ పోట్లాటయెందుకు? నేను చెప్పినట్లు చెయ్యండి. లేకపోతే యీసంగతి నలుగురితో వెల్లడిచేస్తాను.

సుబ్బ—సరే వెళ్లు. వెధవహోటల్. ఇది కాకపోతే మరోటి. (తిరు వెంగళమ్మను జూచి( ఈ పాడుహోట లెందుకు రా. నీ వితరు లకంట పడకుండా వుండేస్థలం చూపిస్తాను. (నిష్క్రమింతురు)



రంగము

[మోహినిగృహము. మీనాక్షి, సుబ్బరామయ్య ప్రవేశము.]

మీనా—ఏమండి! సుబ్బరామయ్య పంతులుగారూ! ఈమధ్య బొ త్తిగా మామీద సీతకన్ను వేశారు. ఆమధ్య మా ప్రథమ మ్మాయిపాపాచలం ఖులాసాగా తిరిగేటప్పుడు దర్శనం యిచ్చే వారు. అది జబ్బుస్థితిలో పడ్డది. మళ్ళీ కలనైనా కనపడడం

లేదు. అవునులెండి, ఎవరన్నా బాగావుంటే చూచేవారేకాని లేకపోతే లేదు.

సుబ్బ— మీనాక్షీ! నాసంగతి తెలిసివుండేకూడా యీలా అంటా వేమిటి ! ఈమధ్య కొద్దిగా జరుగురుపనిమీద సికింద్రాబాద్ వెళ్ళినాను. మొన్న నేవచ్చినాను. మోహిని ఖులాసాగావుందా పాపాచలంవంట్లో యేలావుంది?

మీనా—అయ్యా మోహినికి నీళ్లాడపొద్దులు. పాపాచలంసంగతి యేమనిచెప్పగలను. పాపమాకొండయ్యనాయుడుగారు శాయ శక్తులా తంటాలుపడుతున్నారు. దేవుడిదయ యేలావుందో తెలియదు. నేను మహాచిక్కులో మునిగియున్నాను. తిన్నఅ న్నం నీరయిపోతుంది. కంటికి నిద్రరాదు. (విచారించును)

సుబ్బ—విచారిస్తే లాభ మేముంది.

తే. గీ. చీకటులుపోయి వెన్నెలల్ ౯ వెలగురీతి
కష్టములబాసి సుఖముల ౯ గాంచగలవు
చింతపడనేల యీరీతి ౯ స్వాంతమందు
దైవవిధి నెవ్వరైనను దాటగలరె.

తే. గీ. ఎవరికిగాని యపకారము ౯ మేమిచేసి
యెఱుగవై తివిమున్న నీ ౯ వెప్పుడైన
అట్టినీయందు భగవంతు ౯ డాత్మలోన
నిర్దయనుబూన నొప్పునే ౯ నీలవేణి.

కాబట్టి ధైర్యంబూనియుండు నీ కేవిధమయినయిబ్బందులూ కలుగవు.

మీనా—పంతులుగారూ మీరు యేదైనా పనివుంటేనేగాని దారితప్పి యిక్కడకు రారు. నావలన నెఱవేరవలసిన పని యేదైనావుంటే మీయాజ్ఞ తలమీదబెట్టుకొని తప్పకుండాచేస్తాను.

సుబ్బ—(తనలో) నెమ్మదిగా దీనిటోపీవేసి తిరువెంగళమ్మను యిప్పటదాచేటట్టు చేస్తాను. తరువాతసంగతి చూచుకోవచ్చును. (ప్రకాశముగా) మీనాక్షీ! నీసంగతినాకు తెలియదా నేచెప్పేపని చేయడానికి యితరులకు శక్తివుండదనే నేను నీదగ్గరకు వచ్చాను.

మీనా.—ఆపనేదో చెప్పండి, సందేహం పడుతారుయెందుకు ?

సుబ్బ—ఇది రెండోకంటివాడికి తెలియదు. ఇందులో నీకూనాకూ కూడా లాభంవుంది.

మీనా—అదేదో చెప్పండి. మనయిరువిరిలో జరిగినసంగతి రెండోకంటివాడికి తెలియనిస్తానా. అలామీరు భయంపడవద్దు.

సుబ్బ—మరేమీలేదు. మొన్న నేనొకవైష్ణవచిన్నదానిని సంపాదించినాను. దాన్ని యెవ్వరికీ తెలియకుండా దాచడానికి, స్థలంయెక్కడా కనుపడలేదు. నీవైతే చాయగలవు. నాలుగైదురోజులుదాకా నీయింట్లోవుంటే తరువాత నేనెక్కడైనా తగినస్థలం విచారించి దీసికొనిపోతాను. ఈప్రకారం నీవు చేసిపెట్టాలి.

మీనా—(తనలో) ఈసమయంలో నాకిది బాగానే వుంది. యిద్దరు పిల్లలూంజబ్బుగావున్నారు. మోహినికా నీళ్ళాడపోస్తులు. ఈ సమయంలో యీవిడి చేరదీస్తినా నెమ్మదిగా కొన్నిరోజులుదాకా యీవిడమూలాన సంపాదన చేయవచ్చును. ఆపిల్లను యేలాగో టోపీవేయవచ్చును. (ప్రకాశముగా) సుబ్బారామయ్య పంతులుగారూ! ఇంతేకదా. తీసికొనిరండి. నాయింట్లో వుంటే రెండోవాడికి తెలియనిస్తానా.

సుబ్బ—జాగ్రత్తగా వుంచాలి. మీయింటికి చాలామంది వస్తుంటారు.

తే. గీ. ఏడుమల్లెపూవులయెత్తు ♦ యింతిత్రూగు
మెఱపుతీగిమాడ్కి ని నామె ♦ మెఱయుచుండు
నీవు మంచిదానవటంచు ♦ నెంచి నీకు
పడతి నప్పగించెద నీదె ♦ భారమికను.

మీనా—ఎంతమాటన్నారు. మాపిల్లలను ఏలాచూచుకొంటానో అల్లాచూస్తాను.

సుబ్బ—సరే. తీసుకొనివస్తాను.

(నిష్క్రమించుచున్నారు.)



రంగము.

[పురిటిల్లు. మోహిని పిల్లతోప్రవేశము.]

మోహి—(తనలో) ఈయాడుపిల్లను నాకాదేవు డెందుకియ్యవలెను? సంతానంకలగాలని ఆదేవుడితో నేనెప్పుడయినా మొఱ్ఱపెట్టు కొన్నానా! (పిల్లంజూచి) ఓపిల్లా! నీవు నాగర్భవాసమందేల పడ్డావు!

తే. గీ. సంతులేదంచు మిక్కిలి ♦ చింతనొందు
వారలెందరో యుండ ని ♦ ర్భాగ్యురాల
నైన; నాకడపున జన్మ ♦ మంది తేల
అకట! యేమనివగతు నా ♦ యాత్మలోన.

నీవు మాకులంబునుగాక మరియొకకులమున పుట్టియున్న చో వివాహమాడె భర్తతో గలిసి సుఖింతువుకదా. ఆభాగ్యమేవున్నట్టయితే నాకడుపున పుట్టకనేపోదువు. మిక్కిలినీచమయిన వ్యభిచారవృత్తియం దేకాలంబుగడపవలసిందని బ్రహ్మ నీనుదుటవ్రాసి యిట్లుపుట్టించినాడు

తే. గీ. చారు శారదపూర్ణిమా చంద్రువోలె
వెరుగుచున్నది నీముఖ బింబమహహా
విటులపాళ్లేయ నిన్నెట్లు బృద్ధియందు
సమ్మతించును చిత్తంబు సత్కుమారి.

మీనా——(ప్రవేశించి) అమ్మాయీ! యెప్పుడూ యేదోఒకటి ఆలోచిస్తూనేయుంటావు. అస్తమానం యీలాకూర్చుంటే పొట్టెల్లాగడుస్తుంది.

మోహి——అమ్మా. ఆలోచించుటకేమున్నది. ఈపిల్ల నాకడుపునయెందుకు పుట్టిందాఅని విచారిస్తున్నాను.

మీనా——శుభంవేళ విచారించడంయెందుకు. కడుపున పిల్లపుట్టితేసంతోషిస్తారుగాని విచారిస్తారా!

మోహి——ఈపిల్ల మరివకరికడుపున పుట్టివుండినయెడల సంతోషపడవలసినదే. అందుకు సందేహంలేదు. నాగర్భంలోపుట్టడంచేత విచారిస్తున్నాను.

మీనా——పిల్లా. నీవెప్పుడూ యీలాటి అవాచకపుమాటలాడుతూనే యుంటావు. సరేలే. నీమాటలకేమి! పండంటిపిల్లను వళ్లోపెట్టుకొని విచారిస్తావు.

మోహి——అమ్మా. పిల్లకేవిధమైనవంకరైనా వుందేమోఅని విచారించడంలేదు. వేశ్యగర్భమందు బుట్టిందిగదా యిట్టివుండంటిపిల్లను వ్యభిచారవృత్తిలో దింపాలికదాయని విచారిస్తున్నాను. మరియొకకులంలోపుట్టితే పెళ్లి చేసికొని సుఖించునుగదా!

మీనా——ఇదా నీకుగల్గినవిచారం! చాలులే! నేనింకా యేమిటో అనుకున్నాను. వెనుక నిన్ను కన్నెఱికం చేసికోమన్నప్పుడు కూడా యీలాగే వేదాంతాలుపలికినావు. అదంతా యిప్పుడెందుకు? ముందుపనిచూడు,

మోహి.—అమ్మా, ఇప్పుడు నేనుచేయవలసినపని యేమున్నది?

మీనా—లేకేం. చెట్టంతపనివుంది. నీకు పిల్లపుట్టిందని చూడడానికి నీసరసులంతా వస్తారు. ఆసమయములో పిల్లను వారికిచూపి ప్రతివాళ్ళతోనూ, రూపురేఖవిలాసములందు మిమ్మల్ని పోలి వుంటుంది. అనిపలుకుతూవుబ్బేసి ధనములాగాలి. భారసాల అనిన్ని వరలక్ష్మీవ్రతమనిన్ని పేరుపెట్టి డబ్బుగుంజవలెను. ఈసమయంతప్పితే మరియొకసమయందొరకదు. వెంకటేశ్వరరావు పంతులు సంగతి చెప్పనక్కరలేదుగదా. మనంచెప్పకుండానే పిల్లపుట్టిందని ఉప్పొంగిపోతున్నాడు. కొండయ్యనాయుడుదగ్గర డబ్బుతీయడానికి కొండమీదికోతి దిగిరావాలి. అయినా ప్రయత్నంచేసిచూడు. కంసాలివీరయ్యను బాగా వుబ్బవేస్తివా, ఎన్నయినా నగలు తెచ్చి యిస్తాడు. పూజారి రామానుజాచార్యులవిషయమై నీకే తెలుసును. పెళ్ళిచేసుకొందామని తెచ్చిన రెండువేలరూపాయలూ కైంకర్యముచేసినాము. అది చేసినప్పటికి ప్రతిదినము దేవాలయానికివచ్చేడబ్బు మనకు తెచ్చియిస్తున్నాడు. లింగమూర్తివిషయం అతడు మహావుబ్బులరాయుడు. నీమీద నాకు మిక్కిలి మోజుఅని ఒక్కటంకంపొడి తగిలించితివా కావలసినన్ని పట్టుచీరె లిస్తాడు.

మోహి—అమ్మా. మంత్రిసానితనము వప్పుకొన్నతరువాత యేదివచ్చినాపట్టాలి. మొదట మొర్రో వ్యభిచారవృత్తినాకువద్దని ఎన్నో విధముల నిన్ను వేడుకోగా నీవు వప్పుకోక నన్నందులో దింపినావు. ఇంక యెంతపాపంపనియైనా చెయ్యడానికి వెనుకంజవేయను. నీవెల్లాచెప్పితే అల్లాచేస్తాను. సందేహంవద్దు. అమ్మా. అడుగుట మఱచినాను. పాపాచలంఅక్కయ్యకు ఏలావుంది? కొండయ్యనాయుడుగారు సరిగామందు యిస్తున్నారా.

మీనా.—అమ్మాయీ మనకర్మానికి కర్తయెవరు! పాపము ఆయన శాయశక్తులా తంటాలుపడుతున్నాడు. ఎంతమాత్రము ఇంత వరకు నయముగా లేదు. దేవుడునాపాలిటవున్నాడో లేడో. భార మంతా భగవంతునిమీద వేసినాను. నేనుబ్రతికియున్నంతవరకు మీకెవ్వరికీ ఏవిధమైనహాని రాకుండా వుండడమే నాకు కావలసింది.

మోహి.—దేవుడు చేసేదాన్ని మనం తప్పించ లేముకదా. అయినను అప్పయ్యవిషయమై నీవు విచారించ పనిలేదు. అది జీర్ణించిన రోగ మగుటచేత మందు కొంచం ఆలస్యంగా పనిచేస్తుంది గాని మరియొకటికాదు. కొండయ్యనాయుడు చాలా తెలిసిన వైద్యుడుగాని సామాన్యుడు కాడు. అతడు నాతో కూడా యీ మధ్య మీఅప్పరోగం కుదర్చకపోతే నావైద్యం తగలెయ్యనా అని పలికి ఆవిషయమై చాలా పట్టుదల పూనియున్నాడు. పాపము. ఆయన రాత్రియనక పగలనక నానాశ్రమలు పడుతూ ఆమందు కాదని యీమందూ ఈమందు కాదని ఆమందూ వాడుతూనే యున్నాడు. మనయందుండే అనురాగంచేత లోకులు అస్తమానం మనయింట్లోనే వుంటున్నాడని అనుమాన పడతారని కూడా తలంచడం లేదు, నిజంగా మనమూలాన్ని ఆయన వైద్యపువాడికలు కూడా పోయినవి. ఇంతకూ ఆయనకు మాటదక్కే రోజున్నా మనకష్టాలు గట్టెక్కే రోజున్నా ఎప్పుడు వస్తుందో.

మీనా.—అమ్మాయీ! అన్నిటికీ దేవుడున్నాడు. ఇంక పిల్లకు నీళ్ళు పోసి సరసులు వచ్చేటప్పటికి చక్కగా వళ్ళో కూర్చోపెట్టు కుందుగాని రా. (నిష్క్రమించును.)



రంగము - మోహినిగృహము.

మోహిని శిశువును వళ్ళో పెట్టుకొని కూర్చుండును.

రామానుజాచార్యులు—(ప్రవేశించి తనలో) నిజం ఆలోచించిచూడగా యీమోహినికి దీనితల్లిమోస్తరుగా డబ్బాసలేదు. స్నేహమే ప్రధానంగా చూచుకొనే మనిషిగాని మరివకమోస్తరుది కాదు. తుంటరిరకంలో చేర్చ దగిందిగాదు. ఎంత వినయం! ఎంత నమ్మకం! ఎంతమర్యాద! నన్నుచూస్తే దానికి సంతోషం చెప్పతరంగాకుండా వస్తుంది. ఆపుట్టినపిల్లయొక్క ముక్కు చెవులూ నామోస్తరుగానే వున్నాయని చెప్పితే చూచాను. నిజంగా ఆలాగేయున్నాయి. శ్రావణమాసంలో వరలక్ష్మి వ్రతము చేసుకోనాలని చెప్పడమేగాని ఒక్క దమ్మిడీఅయినా యిమ్మని నన్ను అడగనేలేదు. ఇల్లాటి అమాయకులను చూస్తే నాకు సంతోషం. అడగనివాళ్లకే యియ్యవలెను. ఈ సమయంలో దీనిని బాగా సంతోషపెట్టితినా నాయందు మరింత ప్రేమగా వుంటుంది. కాబట్టి యిప్పుడు దీనికి ఏమి యియ్యను? ఆలోచించి) సరే. దీనికి ఆలోచించడం యెందుకు. దేవుడికి అభిషేకం చేసే వెండిబిందెలు రెండున్నూ పంచిపాత్రలున్నూ, తెచ్చానుగదా! ఇవియిచ్చి రెండోకంటివాడికి తెలియకుండా కరిగించుకోమని చెప్పుతాను. (మోహినిని సమీపించును)

మోహి—ఆచార్యులుగారూ! దయచేసినారూ? ఈవాళ చాలా పెందాళ్ళే వచ్చినారే.

రామా—నేను నిన్న నీతో పెందాళ్ళె వస్తానని చెప్పలేదూ? చెప్పిన ప్రకారం చేయకపోతే నీవేమంటావు. త్వరగా గుడిపూజ ముగించి వచ్చినాను.

మోహి——నన్ను చూచి వచ్చినారా యేమిటి. పిల్లను చూచి వచ్చినారు.

రామా——అబ్బా ! నీవు మా చెడ్డదానవే.

మోహి——నే నెప్పుడూ అబద్ధం ఆడను. ఇదిగో. మా నాయనగారు ఏమి తెచ్చినారో (యని పిల్ల మీ కేసి చూస్తూవుంది.)

రామా——(నవ్వుచూ) ధారసాల యెప్పుడు ?

మోహి——మీచిత్తం యెప్పుడు కానియ్యమంటె అప్పుడే.

రామా——అంతా నాయిష్టమే అన్నావూ.

మోహి——మీయిష్టంగాక నాయిష్టమూ. కర్తలు మీరేగదా.

రామా——అల్లాగయితే ఇదిగో ధారసాలకర్చుకోసం నేను తమాషా వస్తువులు తెచ్చినాను. చూచావు.

మోహి——ఏవీ ? ఏవీ ?

రామా——ఇవిగో. ఈఅభిషేకపు బిందెలున్నూ, పంచిపాత్రిలున్నూ తీసికొని రెండోకంటివాడికి తెలియకుండా కలిగించు కొనండి.

మోహి——ఏమండీ ! పిల్లమీద ఎంతప్రేమండీ.

రామా——ఇవి త్వరగా ఇక్కడనుంచి తీయించు. ఎవ్వరైనా వస్తారు. నేనిప్పటికి వెళ్లి సాపాటుచేసి మళ్ళీ వస్తాను.

మోహి——చిత్తము.

రామా——(నిష్క్రమించును)

[కంనాలి వీరయ్య ప్రవేశము]

వీర——(తనలో) ఆమధ్య వేదాంతంగ్రంథంనిరూపణ విషయంలో నా కున్నూ, పూజారి రామానుజాచార్యుల గారికిన్నీ, తగాదా వచ్చింది గదా. అప్పటినుంచి వాడినిచూస్తే నాకు వళ్ళుమండు కొనిపోతుంది. వాడ స్తమానం మోహినికి నామీద యెక్కువ

యనురాగమని డాబుసరులు చెప్పుతుంటాడు. పెళ్ళిచేసుకుందా మని తెచ్చుకొన్న రూపాయలు క్షవరం అయినాయి కదా. ఇంక వాడిదగ్గిర పయిసా లేదు. నేను మోహినిని సంతోషప అచే సమయం యిప్పుడు వచ్చినది. ఈసమయంలో వాడొక దమ్మిడీఅయినా, భారసాలకు యియ్యలేడు. వాడిమీద దానికి అసహ్యాం పుట్టుతుంది. ఇంక నాసంగతి చూతామా. ఇప్పుడు లోకులకు చేయవలసిన నగలు చాలా నాయొద్దనున్నవి. ప్రస్తు తము యివి మోహినికి యిస్తినా నామీద అనురాగం యెక్కు వగా వుంటుంది. లోకులకు యీయవలసి విషయంలో రేపి స్తా ఎల్లుండిస్తానని తిప్పుతాను. పంతానికి పూజారివాడిమీద కంటె యెక్కువ మోహం వుండేటట్టు చేసుకోవాలి. (మోహినిజూచి) ఇదిగో, మోహిని పిల్లను ఒళ్ళోపెట్టుకొని కూర్చు న్నది. (సమీపించును.)

మోహి—రండి వీరయ్యగారూ. మీరింకా రాలేదని చూస్తున్నాను.

వీర—ఏమీ! నామీద యింతదయ.

మోహి—మీామీాద దయకాకపోతే మరెవరిమీాద వుంటుందని అను కొన్నారు ?

వీర—ఏమో లే. వూరికే అల్లా అన్నావు. నీకు పూజారి రామానుజా చార్యులువారంటే బహిఃప్రాణం కదా.

మోహి—ఎంతమాటన్నారు! నా సంగతి మీకు తెలియదా యేమి టి ? వూరికే అనగానే సరియా ? ఆయనను ఆడించడానికి అల్లా అంటూ వున్నాను. అందుల కాయన కులుకుతూ, అందరి తోనూ, మోహినికి, నామీాద అనురాగం అధికం అని అంటూ వుంటాడు. ఆచార్యులు మీా అందచందములలోగాని డబ్బులో గాని యెన్నోవంతు ? ఆయన్ని అల్లా వుబ్బేస్తేనేగాని మాకు

జరుగదు. ఒక వేళ ఆయనను పుబ్బ వేసినట్లే నన్నూ చేస్తా వంటారేమో ! మీరు సాధారణంగా ఒకరి మాయలో పడే వారు కారు. అయినను మేము వేశ్యలమైనప్పటికి నీతి గలవా ళ్ళముగాని అందరితో పాటువాళ్ళము కాము అన్నట్లు చెప్పడం మఱచి పోయినాను. నిన్న ఒక తమాషా జరిగింది. ఆచార్యు లుగారుయిక్కడకువచ్చినప్పుడు, నేను వేళాకోళానికి "ఏమండీ! ఆచార్యులుగారూ ! వీరయ్యగారి దాతృత్వము చూచినారా ! కురచ్రిదాని భారసాలకై ఒక కంటెయు, గజ్జెల పట్టెడయు, తెచ్చి యిచ్చినారు" అని పలికేటప్పటికి ఆయన ఖంగారెత్తుచూ చూచి నిజమేనా. నిజమేనా. అని పదిసారులు అడిగి మొగం చిన్నదిచేసుకొన్నాడు. మీపేరు చెప్పితేనే ఆయనకు కోపం.

వీర—ఏడిశాడు వెధవ. గజ్జెలపట్టెడ నేను యిచ్చినానంటే నమ్మినాడా.

మోహి—ఎందుకు నమ్మడు. మీరు యియ్యలేనివారలు గనుకనా. ముమ్మాటికి నేను అల్లా చెప్పేటప్పటికి కానీ డబ్బురానీ నేను యిస్తానన్నాడు.

వీర—ఎక్కడనుంచి వీడికి డబ్బు రావడం. పదివేల సంవత్సరాలు తపంచేసినా నాతో సమానంగా డబ్బు సంపాదిస్తాడా !

మోహి—మంచిమాట చెప్పినారు.

[ తెఱలో ]

ఎవరే ! అమ్మా యీవచ్చింది ?

మోహి—వీరయ్యగారమ్మా. పిల్లనిచూడడానికి వచ్చినారు !

[ తెఱలో ]

ఈ చూడడాని కేమిలే. సమయంవస్తే యెవ్వరూ మాట్లాడరు. కడుపు లో లేనిప్రేమ కౌగలించుకొంటే వస్తుందా ?

వీర—అదేమిటి? మీఅమ్మ అల్లా అంటుంది ?

మోహి—ఏమిటో లెండి. ముసలిదానిమాటలు పాటించకండి. ప్రతి దానికి విసుక్కుంటూనే వుంటుంది. పిల్ల భారసాలకున్నూ, వరలక్ష్మీవ్రతమునకున్నూ డబ్బు యెవరూ యిచ్చినారుకారని కోపం. పిచ్చికాకపోతే కోప్పడితే వస్తుందా. ఎంతపెట్టి పుట్టినామో అంతే.

వీర—"టూట్" నేనుండగా తక్కిన వెధవలజోలి నీకేల ? ఇవిగో చూడు ఈనగలు తీసుకో (నగలుయిచ్చును)

మోహి—కూతురుమీదవున్న ఆపేక్ష చేత యియ్యడంగాని నామీద వుండడంచేతనా యేమి యియ్యడం.

వీర—(నవ్వుచు) నీవు మా చెడ్డదానవే మోహిని! సరే. ఇంక నాకు వేళఅయింది. తరువాత మళ్ళీ వస్తాను.

మోహి—మీరు వచ్చేటప్పుడు పిల్లకు ఒకబంగారపు తాయత్తుచేసి తెచ్చిపెట్టుదురూ.

వీర—అదెంత పని లే. (నిష్క్రమించును)

[లింగమూర్తి ప్రవేశించును.]

లింగ—నేతచీరెలు! పట్టుచీరెలు !! రవికెలుగుడ్డలూ !!!

(అని కేకలు వేయును)

మోహి—ఏమిటండోయి లింగమూర్తిగారూ. ఇల్లా కేక వేస్తూ వస్తున్నారు.

లింగ—ఎవరన్నా చూస్తేబట్టలుఅమ్మకోడానికివచ్చినాడనుకొంటారు.

మోహి—మామంచిపని చేశారండీ !

లింగ—ఇంక మోహిని మామూలుప్రకారం మాతో మాట్లాడదు. కాబోలు !

మోహి—అదేమిటి? అల్లాఅంటారు?

లింగ—పిల్లతల్లి వయినావుగనుక.

మోహి—ఇదంతా మీదయయేకదా? నిన్న మాఅమ్మపిల్లనుచూచి సరీగా లింగమూర్తిగారి మోస్తరుగానే యుంటుంది అని అన్నది.

లింగ—(తనలో) ఆహా! ఏమి! (ఇంచుకయూరకుండి) పుట్టప్పుడూరకున్నా కార్యంవచ్చినప్పుడు సప్లయిసరంజాము చేయవద్దూ? ఈబట్టలమూట మీకోసం తెచ్చినాను. తీసుకొని చక్కగా వాడుకోండి.

మోహి—మామీద ఎంతదయవచ్చింది దీనిఖరీదు మేము భరింపగలమా?

లింగ—తమాషాకంటున్నావా. నామనస్సు కనుక్కోడానికంటున్నావా. నీవు నాకు ఖరీదుయిస్తే పుచ్చుకునేదెవరు?

మోహి—లింగమూర్తిగారూ మీరేమంటారో అని అన్నాను.

(తెరలో)

మోహినీ వెంకటేశ్వరావుగారు వస్తున్నారు.

లింగ—మోహినీ. ఈయన ఈసమయములోనే వస్తున్నాడు. ఇప్పటికి నేనువెళ్ళి సాయంత్రం మళ్ళీవస్తాను. (నిష్క్రమించును)

[వెంకటేశ్వరరావు ప్రవేశము]

వెంక—ఈలాగ నాకు యెక్కడా లేనిసంతోషం పూరికే ప్రవాహంగా పొంగిపొరలుతున్నది. నిజమైనపెళ్ళానికి కొడుకుపుట్టినా యింతసంతోషంవుండదు. ఆమోహినికి పుట్టినకుర్రది సరీగా నామోస్తరుగానే యున్నది. సంతోషంకొద్ది భాంసాలకోసం పంచిపెట్టించడానికి 40 మళ్ళ పంచదార తెప్పించి పంపించివేసినాను. ఇంకా ఏమికావలసివుంటుందో కనుక్కోవాలి. పా

పము! ఈమోహినికి నామీాద సంపూర్ణమైన యనురాగంవుంది. ఏదన్నా కావలిస్తే నోరువిప్పి నన్ను అడగడానికి మొగమాటపడుతుంది. ఏమిాకల్లకపటాలుమెఱుగని ముద్దరాలు. వెట్టిఆపేక్ష. మమకారంగలది. నన్నునమ్మివుంది. ఇతరులపైనైనా తలపెట్టదు. ఇట్టిదానికి అది అడుగకుండానే, ఏదికావలయునో కనుక్కొని యిచ్చి సంతోషపెట్టవలెను. యెంతడబ్బు ఖర్చుపెట్టినా యింతనమ్మకమైనకాంత దొరుకుతుందా? మరే!

మోహి—పంతులుగారూ! దయచేయండి.

వెంక—పిల్లతల్లిగారా యేమిటి!

మోహి—ఇదేమిటి? నాకు క్రొత్త పేరు పెట్టుతున్నారు?

వెంక—నీవు క్రొత్తదానవై నావుగనుక.

మోహి—ఇదంతా మీాదయ యేకదా!

వెంక—ఆహాహా! (నవ్వును)

మోహి—(తనలో) ఏంనవ్వురా! బాబూ. నవ్వితే కళ్లన్నీ మూసికొనిపోతాయి ఈసమయంలో ఈయనదగ్గిర నాలుగుడచ్చీలు కొట్టితే ఏమైనాలాభిస్తుంది (ప్రకాశముగా) పంతులుగారూ. ఎవరిసొమ్మువాళ్ళుతిన్నాగాని, యీకాలంలో యితరులు యేడుస్తారెందుకండీ?

వెంక—ఇప్పుడాప్రశంస యెందుకువచ్చింది?

మోహి—ఎందుకయితేనేమిలెండి. ఎందుకుచెప్పడం?

వెంక—కాస్త చెప్పుదూ సందేహించడం యెందుకు యీాలాస్నేహంగా వున్నామని యెవరికన్నా యేడుపుగావుందా యేమిటి?

మోహి—ఎవరికన్నా ఏడుపుగావుంటే మనపనిమనము మానుతామా యేమిటి? మనయిద్దరికి బ్రహ్మదేవుడు రాసిపెట్టినాడు. ఈ రెండుగటాలు జాటేదాకా వదలము.

వెంక — మంచిమాటచెప్పినావు. కానీ కరీనుచేయని వెధవలల్లా పెద్దలమని కబుర్లుచెప్పుతూవుంటారు. అయినాయెవళ్లు మనం బాగావున్నామని యేడ్చేవెధవలు? పేరన్నా చెప్పువినిసంతోషిస్తాను.

మోహి — మీరుపట్టినపట్టు వదలనుకదా. కామారపుజీడివంటివారు. పేరుచెప్పు పేరుచెప్పు అని చంపుకొనితింటారు. చెప్పితే మీ నోట్లో నువ్వుగింజదాగదు. తీగలేచి తంతిమోస్తరు.

వెంక — అబ్బే నేనల్లా వెల్లడిచేస్తాననుకొన్నావా యేమిటి! అల్లాటి వేషాలులేవు.

మోహి — ఎవరున్నారు మనకొండయ్యనాయుడుగారే.

వెంక — వీడా సరేలే. ఇంకా యెవరోఅనుకొన్నాను. వీడిపేరుచెప్పితే జ్ఞాపకంవచ్చింది. మీవాపాచలానికి యేలావుంది? ఏమన్నా కాస్త నయమేనా?

మోహి — ఏంనయమనిచెప్పను. నాయుడు శాయశక్తులా తంటాలుపడుతున్నాడు. నాఅదృష్టానికి ఆయనకర్తలా యేమిటి?

వెంక — వాడు వట్టిదొంగ. మహాడబ్బాస.

మోహి — నిజమేనండి. మీరీసంగతి కనుక్కొన్నారూ!

వెంక — పోనీ! ఇంకొకడాక్టరును పెట్టకూడదా.

మోహి — అన్ననుగాసి ఇంకొకడైతే అప్పటికప్పుడు డబ్బు కక్కవద్దా అదిగాకుండా నాయుడుగారి పినతాతగారు కొన్నాళ్ళు మాఅమ్మను వుంచుకొన్నారు. అందుచేత కొంచెము మొగమాటముంచి పని చేస్తూన్నాను.

వెంక — సరేలే. ఎవరైతేనేమి. ఏదో కుదరడం ప్రధానం. ఇంతకూ భగవంతుడు దయకూడా వుండాలి.

మోహి — నానా చిక్కులలోనూ పడిపోయినామండీ పంతులుగారూ.

వెంక — నేనుండగా మీకేం చిక్కులే.

మోహి—మీరామాత్రం మాటసాయం చేస్తే మా కింకేమి కావాలి.

వెంక—అడుగుదా మనుకొని మఱచిపోయినాను. మీయింట్లో యెవరో ఒక క్రొత్తమనిషి తిరుగుతూవుంది. దానిమొగాన బ్రాహ్మణకళవుంది.

మోహి—ఆవిడ మీకళ్లఁ పడ్డదీ. మాఅమ్మ ఆవిడను ఎంతో రహస్యంగా దాచిందే.

వెంక—దాస్తే దాగుతుందా యేమిటి? దృష్టితగులుతుందని కాబోలు రహస్యంగా దాచింది. అయినా ఆవిడ యెవ్వరు ?

మోహి—ఎవ్వరైతే మీకెందుకు ? మీకన్నేమన్నా ఆవిడమీద పడ్డాదా యేమిటి? అంత యిదిగా అడుగుతున్నారు.

వెంక—నాకెందుకే నువ్వుండగా వూరికే "ఇన్ఫర్మేషను గ్యాదర్" చేయడానికి అనగా సంగతి సందర్భాలు తెలుసుకోవడానికి అడిగినాను.

మోహి—మీకెందుకండి. ఆరహస్యాలన్నీ తెలుసుకుంటే యేంలాభంవుంది. ఆవిడ ఖర్మంచాలక, యీలావచ్చింది. ఇల్లాటివాళ్ళు బయలుదేరడంచేతనే మానోట్లో మన్నుపడుతూవున్నది.

వెంక—అది లేచివచ్చినబాపతా యేమిటి ? అల్లాగయితే యిక్కడ యెందుకువుంది. ఎవరు తీసుకొనివచ్చినారు.

మోహి—ఎందుకండీ. అదంతాను?

వెంక—నిన్నుచంపుకుతిన్నట్టే. ఎవ్వరితోనూ చెప్పను చెప్పు.

మోహి—మనబాతాఖాసీల సుబ్బరామయ్యపంతులుగారు ఎక్కడినుంచో తీసుకొనివచ్చినారు. ఇక్కడవుంచితే యెవరికీతెలియకుండ వుంటుందని వుంచినారు. రెండురోజులలో యింకొకయిం

ట్లోకి తీసికొనిపోతానని చెప్పినారుకాని మళ్లీ ఆయన మొగమే కనపర్చలేదు. నాకు చాలా భయంగానేవుంది.

వెంక—ఛీ. మీఅమ్మ అన్నీ యీలాటివ్యాపారములే పెట్టుకొంటుంది ఈసంగతి పోలీసువారికి తెలిస్తే ఎంతమాట! ఆదొంగసుబ్బారాయుడు దీనిని మీకొంపముంచడానికే మీయింట్లో పెట్టినాడు. అయినా నాకెందుకులే. ఎవళ్లెగంగలో దిగితేనాకేమి.

మోహి—నేనూ అదే జడుస్తున్నాను. నెమ్మదిగా మాఅమ్మతో చెప్పి యీవిడిని అవతలికి సాగనంపించాలి. లేకపోతే మాకొంప మీదికివస్తుంది.

వెంక—మళ్లీ! మీఅమ్మతో నేను చెప్పినానని చెప్పవద్దు. నామీద పడి యేడుస్తుంది.

మోహి—నేను పిచ్చిదాననుకొన్నారా యేమిటి?

వెంక—సరేకాని, ఆసంగతి అల్లావుంచు. నేనొక్కరహస్యం చెప్పుతాను, ఎవ్వరితోనూ చెప్పవుకదా?

మోహి—మీవిషయములో నేనెప్పుడయినా అల్లాప్రవర్తించినానా. నాసంగతి మీరు యెఱిగివుండికూడా యీలా అడుగుతారెందుకు?

వెంక—మరేంలేదుగాని, ఈసంగతి రెండోవాళ్లకు తెలిసిందిఅంటే కొంప మునుగుతుంది. అందుకని నేను యింతగా చెప్పినాను.

మోహి—నావిషయమై సందేహించవద్దు. నాప్రాణములకంటెమీరు యెక్కువయని భావించివున్నాను.

వెంక—అందుకనే చెప్పుతున్నాను, విను. ఈమధ్య నేను లోకులకు బాకీలున్నవాటికి చాలాకంప్లెయింట్లు దాఖలుఅయ్యినవి. అవి డిక్రీలయినాయంటే వున్నకాస్తఆస్తిదక్కదు. అందుకని నేనీ మధ్య భూములన్నీ అమ్మివేసినాను. అందుమీద యెనుబదివే

ల రూపాయలు వచ్చినవి. ఇవి నాయింటివద్ద వుండడానికి వీలు లేదు. కాబట్టి యీరూపాయలు మీఅమ్మకైనా తెలియకుం డా జాగ్రత్తగా దాయాలి.

మోహి—ఇంతేకదా. నాయందు మీకు నమ్మకముంటుందా.

వెంక—నమ్మకం వుండబట్టే నీకియ్యడం. (సంచియిచ్చును)

మోహి—నేనిది అతిజాగ్రత్తగా దాస్తాను. మీకు కావలసివచ్చి నప్పుడు తీసుకొనవచ్చును. ఇంతేకాకుండా నాపెద్దపెట్టిలో మీరేపెట్టుకొని, తాళంవేసుకొని, చెవ్వి మీదగ్గరనే యుం చుకోండి.

వెంక—ఎవరిదగ్గరవుంటేనేం. (ఇంచుక యూరకుండి) ఇంకనాకుపొద్దెక్కింది. పోతాను. (నిష్క్రమించును)

మోహి—(తనలో) ఈయన నాయందున్న నమ్మకముచేత నేకదా ఇన్నిరూపాయలు నాచేతికిచ్చినాడు. ఈపళంగా నేనివి యపహరిస్తే నన్నెవ్వరేమిసేయగలరు. కాని, నేనేమడిగితే అదియిస్తూ నన్నివిధాల కనిపెట్టి ఆయన్ను మోసముచేస్తే ఎంతపాపము. పూర్వజన్మమందు, ఎంతోపాపముచేస్తేనేగాని యీపుట్టకదొరకదు. అదిగో మాఅమ్మవస్తున్నది.

[మీనాక్షి ప్రవేశించును]

మోహి—అమ్మా! ఏమిపనిమీదవచ్చినావు?

మీనా—మరేంపనిలేదుగాని, నీసరసులదగ్గర భారసాల వరలక్ష్మి వ్రతము అని వంకపెట్టి యేదైనాలాగినావా!

మోహి—అమ్మా! ఇదిగో రామానుజాచార్యులుగారు ఈ వెండిబిందెలు పంచిపాత్రలున్నూ యిచ్చినారు. కంసాలి వీరయ్యగారు యీవస్తువులిచ్చినారు. లింగమూర్తిగారు ఈ చీరలిచ్చినారు.

మీనా—(చూచి) బాగానే యున్నది. అమ్మాయీ! ఈమూట యేమిటే?

మోహి—అమ్మా. అప్పుడే యీమూట నీకెక్కడ కనపడ్డది? ఇది పాపం రహస్యంగా దాచిపెట్టమని వెంకటేశ్వరరావుగారు యిచ్చినారు.

మీనా—ఓహో పొలాలుఅమ్మిన బాపతు కాబోలు!

మోహి—ఈసంగతి నీకు యెల్లా తెలిసింది?

మీనా—మనమంటే నోరుమూసుకోవచ్చునుగాని లోకం మూయగలమా. ఆయనమీద చాలామంది కంప్లయింట్లు దాఖలుచేసినారని భయమేసి, పొలాలన్నీ ఫయిసలుచేసినాడు. (ఇంచుక యూరకుండి) ఈసొమ్ము నిన్ను దాయమన్నాడా యేమిటి?

మోహి—అవును. నాయందువున్న నమ్మకంచేత దాయమన్నాడు.

మీనా—అమ్మాయీ! మనఅదృష్టం పండేరోజువచ్చింది ఈరూపాయలు మనంకోరనిదే వాటంతట అవి మనయింటికి వచ్చినవి. ఈసమయంలో మనము వూరుకోరాదు. ఎన్నాళ్లుకష్టపడితే యిన్నిరూపాయలు వస్తాయి.

మోహి—నీప్రద్దేశమేమో తెలియలేదు. ఈరూపాయలు కైంకర్యంచేదామనియా యేమిటి నీయభిప్రాయం?

మీనా—మరేమనుకొన్నావు. అదే.

మోహి—అమ్మా. ఎంతమోసం తలపెట్టినావు. నన్ను తనప్రాణంకంటె యెక్కువగా చూచుకొనుచు కావలసినడబ్బుయిస్తూ మనలను అన్నివిధాలా కనిపెట్టుతూవున్న ఆయన్ని మోసముచేయుట పాపముకాదా? నామీద నమ్మకం వుండడంచేతనే కదా దాచనిచ్చినాడు!

మీనా—నీవు యివన్నీ చూస్తూవుంటే బాగానేబాగుపడతావు. ఈక బరులకేమిలే. నామాటవిను. నీవు యింకా ఆరునెలలదాకా సంపాయించలేవు. ఇద్దరప్పులూ మంచమెక్కివున్నారు. వాళ్ళు బ్రితుకు నిశ్చయంలేదు. ఇంక వెంకటేశ్వర్రావుసంగతి చెప్తా తాను. లోకులందరకీ ఆయన బాకీలుపడి యీలా పొలాలుస మస్తం అమ్మివేసినాడు. ఆయనమాత్రిం నిన్ను ఒకనెలపోషిం చేను రెండునెలలు పోషించేను వాడుపోతే వాడితాతవంటి వాడిని యింకొకడిని నీకు తీసుకొనివస్తాను. నీవావిషయంలో సందేహించవద్దు. మీకోసమేకదా నేనింతపాటుపడడం. లేక పోతే ముసలిముండకు నాకేంకావాలి నీకు కూతురుకూడా పుట్టింది. దానికి చక్కనినగలు చేయించాలి. డబ్బుయేలావస్తుం దనుకొన్నావు.

మోహి—ఇది మనము యిప్పుడు అపహరిస్తే లోకులకు తెలియదా! వెంకటేశ్వరరావు మనమీాద అపోహపడడా?

మీనా—అనుమానము యేమీాకలగకుండానే చేతాము.

మోహి—ఎట్లా చేయగలము?

మీనా—ఏమీా కష్టపడనవసరములేదు. నీగదికి రాత్రి మనచంద్రి య్యచేత కన్నంత్రివ్విద్దాము. మరునాడుపొద్దున్నే దొంగలు పడి దోచుకొనిపోయినారని గొల్లునయేడుద్దాము. ఆవెంకటే శ్వరావు తనదురదృష్టమును నిందించుకొనుచు వూరకొనును. మనం చేసినామని యపోహపడడు. ఇంతకంటె మంచిదారియే మీా కనపడకున్నది ఇందుకునీవుమూగుపలుకక సమ్మతింపుము.

మోహి—ఇట్టి మహాపాపకార్యములు చేయుచున్న మనము యేగతి నందుదుమో యని భయముకలుగుచున్నది.

మీనా—అమ్మాయీ! పుణ్యపాపము లన్నమాటసున్న, మనం పు

ణ్యంచేసుకోబట్టే మనయిల్లు నిత్యకల్యాణం పచ్చతోరణంలాగ వున్నది.

మోహి—అమ్మా! నీయిష్టంవచ్చినట్లు చెయ్యి. (ఇంచుకయూరకుండి) నేనడగడం మఱచిపోయినాను. ఆమధ్య సుబ్బరామయ్యగారు తీసుకొనివచ్చిన వైష్ణవావిడ యిక్కడనేవుందా. ఆయనమళ్లీ వచ్చినాడా.

మీనా—దిగబెట్టివెళ్ళినది లగాయతు ఆబ్రాహ్మణుడు మళ్ళీ ముఖం కనపర్చలేదు.

మోహి—ఆవిడ యిక్కడవుండడం మనకేమిముప్పువస్తుందో యని భయముగలుగుతుంది. నెమ్మదిగా సాగనంపరాదా.

మీనా—మనకేం యిబ్బందివుంది అంతగా యెవరైనాచూచి అడిగితే యిక్కడ కాపురంవున్నదని చెప్పవచ్చును. అంతేకాకుండా నేనావిడను వుంచడానికి కారణముంది. మనయింట్లో ప్రస్తుతం సంపాదించేవాళ్లు యెవరున్నూ లేరు. నెమ్మదిగా ఆవిడను వశపఱచుకొని ఆవిడనుమూలంగా ధనం సంపాదించడానికి.

మోహి అమ్మా! నీయూహాలన్నియు కొంపలుతీసేవేకదా! అనవసరమైన గొడవలలో దిగక నెమ్మదిగా ఆవిడను సాగనంపు.

మీనా—చూదాములే. అనా నికిరా.

(ఇరువురును నిష్క్రమింతురు.)

రంగము.

[మూలగదిలో మీనాక్షి, తిరువెంగళమ్మ ప్రవేశించుచున్నారు.]

మీనా—ఏమండీ! తిరువెంగళమ్మగారూ. అస్తమానము ఏకఆలోచిస్తూనే యుంటారు.

తిరు—మీనాక్షీ. సుఖాన్నివున్నవాళ్లం దుఃఖాన్ని పెట్టుకొన్నాను కదా యని విచారిస్తున్నాను.

మీనా—మీ కేమమ్మా. సుఖంగావున్నారు. నాయింట్లో వున్నంతమట్టుకు మీ కేమీకొంత లేదు. పాపము. మిమ్మచూస్తె నాకు మాత్రం జాలి మిక్కిలీకలుగుతూవుంది. ఆసుబ్బరామయ్యగారు నీకు యెక్కడబాపరించినారమ్మా. తీసుకొనివచ్చినారు. ఇక్కడ దింగబెట్టినారు. మళ్లీ మొఖమయినా కనపర్చలేదు. ఆయన వ్యాపారమంతా యిల్లాటిదే. ఇంక మీరాయనమీద ఆసవదలేశయ్యండి మరొకమార్గం తొక్కండి.

తిరు—ఇంకమార్గాలు యేమున్నాయి. కళ్లు ముక్కు మూసుకొని కృష్ణలో దిగడమే.

మీనా—హరిహరీ. ఎంతమాట పలికినావమ్మా. నీ కేమీభయములేదు. చక్కనిచుక్కవు. ఎవరుచూస్తెవారు నెత్తిమీద పెట్టుకుంటారు. మీకు నేను తగుపెద్దమనిషిని యెవరినైనా కుదురుస్తాను ఆయనతో హాయిగావుండండి. అంతపర్యంతం మీరేమీ యిబ్బందిపడకుండా యిక్కడవుండండి. మీకు నేను సప్లయిచేయిస్తాను.

తిరు—(తనలో) ఆహా! నా కెట్టిగతివచ్చింది. చిన్నప్పటినుండియు, నన్నతిగారాబముగ బెంచిన తల్లిదండ్రులనువీడి యీమాయలమారి సుబ్బరామయ్య వలలోబడి యిచ్చటకు జేరుకొంటిని. ఆతడు నన్నుయిక్కడదిగబెట్టినప్పటినుండికనపడడములేదు. పాపమునాకోసం నాతల్లి దండ్రులెంత దుఃఖిస్తున్నారో. వ్రతముచెడినను సుఖముదక్కదయ్యెనను సామ్యము నిజమైంది. ఇప్పుడు నేను యేమివిచారిస్తె ఏమిలాభంవుంది పోనిమ్ము. ఇంటికిపోదామంటే నలుగురూ మొఖాన్నివుమ్మేస్తారు. ఇందులకేదైన దగినవుపాయ

చూచుకోవాలి. (ప్రకాశముగా) మీనాక్షీ! నీవు నాయందు వుంచినదయకు చాలాసంతోషిస్తున్నాను. నేడేమోగాని నాకు మిగుల తలనొప్పిగావుంది. ఈవిషయమై రేపు తప్పీలుగా మాట్లాడుదాము.

మీనా—అల్లాగే. (నిష్క్రమించుచున్నది.)

తిరు—(తనలో) దీనిసంగతిసందర్భాలు చూడగా, నన్నుగూడా పడుపువృత్తిలో దింపాలనేవుంది. ఆహా! నాకర్మమిట్లుకాలిందా. నేనిందుకు సమ్మతింపవలసినదేనా. (సుబ్బరామయ్య నుద్దేశించి) ఓసుబ్బరామయ్యా, నీడాబుసరికబురులు చూచి, మోసపోయితినిగదా! ఎంతమో కూర్మితో నన్ను చూశావనుకొన్నాను. ఇట్టివాడవన్న సంగతి నాకు తెలియలేదుకదా. నిష్కారణముగ పట్టియమాయకురాలనై యింటనున్న నాహృదయంబున నిట్టిబుద్ధి ప్రవేశపెట్టి తుదకిట్లు గొంతుకగోసితివా! ఏమీలేక, ఏదోతీరుగ భేషజంబుచేత నక్కడా యిక్కడా కాలముగడుపుచూ పొట్టబోసుకొనేవాడవన్న సంగతి తెలియకపోయిందికదా ఈరీతిని నీవు యెందరిని వంచించితివో! ఎవ్వరినైనను నిక్లోవంచించితెచ్చి వేశ్యలకిట్లే యప్పగింపుచుందువు కాబోలు. ఇదియేనా. నీకులవృత్తి. ఛీ! నీజన్మకాల్పనా! నన్నింతక్షోభపెట్టితివా? నాయుసురు నీకు దాకకయుండునా! (ఇంచుకయూరకుండి) ఆతనిని దూషించినందువలన నాకేమిలాభమువుంది. నాకర్మానికి అతడేమిచేస్తాడు. అతడు చెప్పిమాటలకు నేనేలనమ్మవలెను. "వినాశకాలేవిపరీతబుద్ధిః" యన్నట్లు చేటుకాలము సమీపించేటప్పటికి యిల్లాటిబుద్ధులుపుట్టుతూవుంటాయి. లేకపోతే యెన్నడైనా యిట్టికోరికగలిగిందా? మోహామా! కామమా! మీరెంతపనియైనను చేయగలరు.

మ. నవమాసంబులుమోసిమోసి కని నా కై నాకష్టముల్ బొంది శై
శవజన్మోత్కటబాధలన్ సయిచి మో కై కుంబీవేయుంచొచి పెం
చి వినోదించినయట్టి తల్లినిగృపన్ కై వీక్షింపకే పీడగా
భువి గావించితి రెంతవారలో కదా కైమోహంబ! యోకామమా.

కామాన్ని తిట్టితే లాభ మేమున్నది. మోహాన్ని తిట్టితే యేంలాభమున్నది. నాకర్మాన్ని తిట్టుకోవాలి, నాసంగతి అల్లా వుంచుదాము. లోకములో యౌవనులయిన వితంతువులంతా యిల్లాగే చేస్తుంటారు. చేయకపోతేయేలాగు? చిన్నప్పుడే భర్త చచ్చిపోతేజీవయాత్రగడపడం యెల్లా? వితంతుబ్రతుకు పట్టివ్యర్థముకదా! బుఱ్ఱనున్న గా గొఱిగించుకొనవలెను. ఒంటిపూటతిండి తినవలెను. గాజులుబొట్టు వగైరాయివుండకూడదు. మంచముమీద పడుకోరాదు. ఇల్లాటి యవస్థలన్నీ అనుభవించాలి. ఇదేంకర్మం. హాయిగా స్వేచ్ఛగా వితంతువులకుగూడాబహిరంగముగా వివాహములు సేయరాదూ. అట్లుచేస్తేతప్పట. ఇల్లాటివ్యభిచారములుచేస్తూ యింట్లోనేవుంటేమంచిదంట. వెధవపెళ్ళిచేసుకుంటే కులంలోంచివెలి. వెధవయై యింట్లోవుండివ్యభిచారంచేసి, బిడ్డలనుకంటూవుంటే వెలికాను. అదిమంచిపని. వితంతువులకు వివాహాలుచేయడం బాగా మొదలుపెట్టితే వీరిలోవ్యభిచారవృత్తిన్నీ, రహస్యంగాకన్నపిల్లలనుచంపడమున్నూ, తగ్గిపోయి లోకముబాగుపడుతుంది. అందుకనే ఈమధ్యకొందరు మహాపురుషులు వూరూరాతిరిగి, వెధవలకుపెళ్ళిళ్ళుచేయవలెనను యుపన్యాసాలివ్వడం ప్రారంభించారు.అంతేకాకుండా ఒకవితంతు శరణాలయాన్ని పెట్టి యచ్చటకు వెధవలనుచేర్చి, పెళ్ళిళ్ళు చేసిపుణ్యముకట్టుకొంటున్నారు. ఇల్లాచెయ్యడం కుండనాలవారికి ఝారీచెంబులవారికి పనికిరాదు. వారు పనికిరాదంటే ఆగుతుంతా యేమిటి? గొప్పవారంతాయీవిషయమైపట్టుపట్టినారు. (ఆలోచించి) ఇంక నేనా

లోచించినందువలన లాభంలేదు. తిన్నగా యిచ్చటినుంచి బయలుదేరి వెళ్లి వితంతుశరణాలయంలో ప్రవేశించి యొక్కనిపెండ్లియాడి సుఖ స్తాను. చెడ్డదాన్ని యెల్లాగుచెడ్డాను. ఇంతవరకు దైవం నన్ను సరీగా చూచినందుకనేక వందనాలు——(నిష్క్రమించును)



రంగము.

[మోహిని గృహములోగది కొండయ్యనాయుడు,
మోహిని ప్రవేశము]

మోహి——ఏమండీ! కొండయ్యనాయుడుగారూ! మాఅప్పలకు ఏంగతి చూపిస్తారు. నిముష నిముషానకు కాళ్ళూచేతులూ చల్లపడి పోతూవున్నవి.

కొండ——మోహినీ! నన్నేమిచేయమంటావు ఎన్నోఖరీదులుగల మందు లు పోస్తున్నాను. శాయశక్తులా తంటాలుపడుతున్నాను. మం దంటే యివ్వగలుగుదునుగాని యాయుర్దాయము నేనుపొయ్య గలుగుదునా.

మోహి——మాఆదుర్దాకొద్ది అడుగుతున్నానుగాని మరియొకటికాదు. నాకు పిల్ల స్థితిచూడగా కొంపమునిగేటట్టేవున్నది.

కొండ——మోహినీ! ఆసంగతియిప్పుడేమి అమ్మతో చెప్పితివాగుండెలు కొట్టుకు చచ్చిపోతుంది. వైద్యులము మేమట్లా చెప్పడంభావ్య ముకాదు. ఎంతఆలోచించిచూచినా నీఅప్పలవిషయంలో నాకు చాలా సందేహముగ వున్నది. ఇప్పడే పాపాచలానికి, త్రైలో క్యచింతామణి యిచ్చినాను. తిరిగిందా యీదెబ్బతో తిరుగు తుంది లేదా అంతే.

మోహి——అయ్యో!! అయ్యో!! మాకర్మం కాలిపోతుందా!!! (ఏడు స్తున్నది)

కొండ—నీవేమో రహస్యంగా అడిగినావుకదాఅని నేను చెప్పితేనీవు యిప్పటినుంచి గోలచేస్తున్నావా. ఈలాగైతే, నేను యిప్పుడే యిక్కడనుంచి వెళ్ళిపోతాను. నీగోలచూచి మీఅమ్మ గోల పెట్టుతుంది. అంతేకాకుండా నీవుబాలింతరాలవు. విశేషంగా ఏడిస్తె వళ్లు పచ్చిచేస్తుంది.

మోహి—నాకు వస్తున్నదుఃఖము ఎల్లాఆపుకోను. ఎంతఇదైనా ఒక కడుపునపుట్టకపోయినా అప్పచెల్లెండ్రమై యున్నాముకదా!

కొండ—దైవము చేయబోయేదానికి మనము యేమిచేస్తాము. అయి నా యింతలోవచ్చిన పరవా యేమీలేదు. ధైర్యంతోవుండు.

[లోపల]

అయ్యో! ఇంకేమున్నది! అయిపోయింది! ఏమండో! ఏమం డో! కొండయ్యనాయుడుగారూ? రండి! రండి!

మోహి—అయ్యో! కొండయ్యనాయుడుగారూ! ఇంకేముందండి! వెళ్ళండి! వెళ్ళండి!

కొండ—(తొందరగా నిష్క్రమించును)

మోహి—మాఅమ్మగుండెల్లోరాయిపడిపోయిందే. ఇంకేందారి. అదు గో మాచంద్రియ్య వస్తున్నాడు.

చంద్రియ్య—(ప్రవేశించి) అమ్మాయీ! మోహినీ. ఇంకేముందే మనపనిఅయిపోయింది. యిద్దరప్పల్నీగూడా కిందపెట్టేశారే.

మోహి—ఏమిటిచంద్రియ్యతాతా! యీకర్మం? యిల్లాటివింత యె క్కడాచూడలేదు.

చంద్రి—పాపాచలాన్ని కిందపెట్టగానే రాజరత్నంచూచి గాభరా పడి ప్రాణాలువదిలింది.

మోహి—కొండయ్యనాయుడుగారు అక్కడలేరా?

చంద్రి—ఎవరుంటే యేమిచేస్తారు. నీవుమాత్రము గట్టిగా యేడ్వకు. వళ్ళు వచ్చిచేస్తుంది.

మోహి—నమ్మ ఎంతో ముద్దుగాచూచేఅప్పలు గతించిరిగదా.

చంద్రి—భగవంతుడు చేసినదానికి యెవ్వరేమిచేస్తారు.

మోహి—సరేకాని, వెంకటేశ్వరరావుగారు దాచియుంచినరూపాయలపహరించడానికి, కన్నముకూడా యీరోజునే త్రవ్వినాము. ఇదేంకొంపమునుగుతుందో.

చంద్రి—ముందుగాతొందరపడినాము. మీఅమ్మ తవ్వేయ్యమనగానే త్రవ్వేసినారు. అయినా సొమ్ము మీఅమ్మ భద్రంగానే దాచింది లే.

మోహి—అన్నిటికీ భగవంతుడున్నాడు. ఒక్కసారి చచ్చినఅప్పలను కళ్లతోన్నా చూస్తాను. రా.

చంద్రి—ఏదో పెద్దకేకలు వినపడుతున్నాయి. ఏదోగంద్రగోళంజరుగుతున్నట్లున్నది. త్వరగా రా.

(ఇరువురును నిష్క్రమింతురు)

రంగము.

[వెంకటేశ్వరరావు ప్రవేశము.]

వెంక—(తనలో గుండెలుకొట్టుకొనుచు) అయ్యో! అయ్యో! ఎంతపనిజరిగింది. నాకొంప కూలిపోయిందే! నానోట్లోమన్నుపడ్డదే! నమ్మకంగలిగిన స్థలంగదా, నాయింట్లో పుంటేపరాత్రి ఏజపు యేమావుకారు తీసుకొనివస్తాడో అని భయపడి యిక్కడ దాచినాను. మోహినియందున్న నావలపు, నాఅనురాగం, నామోహము, యింతకొంపదీసింది! ఒకనూాల మీనాక్షికూ

తుళ్లుయిద్దరుచచ్చి యేమనుస్తుంటే దొంగలుమోహినిగదికికన్నం తవ్వి నారూపాయలెత్తుకొనిపోయినారు; హా! నేనిక్కడయెందు కు దాచుకొన్నాను. ఇందుకేకాబోలు దాచుకొన్నాను. చచ్చే మనుస్తుంటే కన్నంతవ్వడానికి ఆదొంగలకుచేతులెట్లావచ్చినాయో కదా! దొంగవెధవలు యిదంతా ఆలోచిస్తారా. ఎల్లాగయితే నేంనానోట్లో మన్నుకొట్టినారు. అయ్యో! ఇంక నేనేమి చెయ్యను! ఎవ్వరితో చెప్పుకోను! పోయినడబ్బు మళ్లీ దొరుకుతుందా! మోహినిచేతికిదాచిస్తే యిల్లాగయింది యెవ్వరితోనైనా చెప్పుకుంటే సిగ్గు. చెప్పుకొన్నందువలన ప్రయోజనం కూడా లేదు. పైగా చెప్పుదెబ్బలు. (ఇంచుకఆలోచించి) ఏమో నేనువెఱ్ఱిగా ఆలోచిస్తున్నాను. ఎన్నడు లేనిది. వీళ్ల యింటికిదొంగలు రావచ్చారా యేమిటి! వీళ్ళేదొంగలు వీళ్లేనాకొంపదీశారు వీళ్ళుతప్ప యీపని యెవ్వరుచేయగలరు! అల్లాకాకపోతేఒక్క నాసొమ్మేపోవడమేమి. ఇదంతా మీనాక్షిపన్నిన కృత్రిమవ్యూహమే. మోహినికూడా అందులో కలిసేవుంది, మోహినిపెద్ద మనిషితరహామాత్రం ఏమివుండింది. డబ్బుచూస్తే దానికిమాత్రము చేదా యేమిటి? పూరికేనామీద అనురాగంవున్నట్టు నటించేదేగాని కోండయ్యనాయుడు, రామానుజాచారి, కంసాలి వీరయ్య, జంగంనాగిలింగం, పేరయ్యశెట్టి మొదలయినవాళ్లంతా వస్తూపోతూనే యున్నారని విన్నాను. నామీద అనురాగమల్లా డబ్బులాగడానికేయని యీమధ్య నే కనిపెట్టినాను. ఎల్లాగయినా సద్దుకుందామని అనుకుంటూ వుండగానే యీ ముండలు నాకింతద్రోహము చేసినారు. (మోహినినివుద్దేశించి) ఆహా! మోహినీ! నీవెంతపనిజేయ సాహసించినావు. ఇల్లాచేస్తానని నేనుకలలోనైనాతలంపలేదుగదా. అమ్మా! ఎంతసాహ

సము! ఎంతమాయదారితనము! నీటక్కులు, నీమాయలు, నీవినయము, నీనవ్వులు. నోరుమాటలాడుతూవుంటే మొసళ్ళు ఎక్కిరించేమాటలు! తెలియక వంచింపబడితిని. అయ్యో నా కొంప గుభాలున నట్టేట్లో కలిపేశావుగదా! నిన్ను నేను ఎల్లా చూచినానో అది కాస్తయినా తలచినావు కాదుకదా. విశ్వాసం లేకపోయిందికదా! నీకు కన్నెఱికముకు మాటపదహారిస్తి నికదే. తరువాత నెలఒక్కంటికి ముప్పయిరూపాయలిస్తూవచ్చి తినికదా! కావలసినది నీయదాన్ని పెట్టుతూ నేనుంటిని. అను రాగంవున్న దానిమల్లే నటిస్తూ యిష్టమైనవాళ్లతో నల్లాపోతూ డబ్బుగడిస్తూ చూచీచూడనట్లు వూరుకుంటినే నీకు నేనేమితక్కువ జేసితిని! నమ్మకముగలదానివికదా అని తలంచిరూపాయలు దాచిస్తే అపహరించివేసి కన్నంకొట్టించి దొంగలువచ్చినారని గొల్లుమనియేడ్చి నాకొంపతీశావు. అమ్మా! ముండా. ఎంతటి దానవే. నీవు నీతల్లినిమించినముండవు. నిన్ననడంవల్ల లాభమేమున్నది. బాగా నున్నగా వైధవముండకువరం చేసినావు. వళ్ళూపై తెలియక కన్నుమిన్నుగానక నిన్ను జేరిన నావంటిదరిద్రం ముండాకొడుకున కిల్లాకావలసినదే. యిల్లాటిబోగం వాళ్లతో సహవాసంచేయమని యెవ్వరుచెప్పివారు. బోగం వాళ్లను వుంచుకొన్న వాళ్లు యెవరు బాగుపడ్డారు. కామేశ్వరరావు బాగుపడ్డాడా. వెంకటరామయ్యపంతులు బాగుపడ్డాడా! ఇంకెవ్వరు బాగుపడ్డారు. అంతాజోగులై అడుక్కుతింటూ వున్నారు. యిదంతా యెఱిగివుండేకూడా బుద్ధిహీనిగడ్డితిని నీదగ్గరచేరి నందుకు మంచిపనిజేసినావు. బోగంవాళ్లంటే యేమిటోయిప్పటికి తెలిసింది.

మ. కపటస్నేహముజేసి నమ్మికలు వ - ర్ణించి ద్రవ్యంబుకై
యుపలాలింపుచు ద్రవ్యమంత కరమం - దున్నంతయున్ లాగి బు
క్కపకీరున్ వలెచేయుబూనెడిల స - త్కాంతామణుల్ వేశ్యలన్
జపలస్వాంతల నమ్మరాదెవరు ను - స్వాంతంబులం దెప్పుడున్.

చ. చలువలుగట్టి సన్నగను - జాదుముఖంబున బెట్టి పువ్వులన్
వెలయగ జుట్టి మేల్సిగకు - వేడుక వాకిటనిల్చి పైటనున్
వడిసవరించుకొంచు దిట - వర్గముగాంచి యనేకరీతులన్
గలతురు వారిచిత్తమును - కామిను లీవెలయాండ్రు భూమిపై.

తే. గీ. ప్రాణమున్నంత దాకనిన్ - బాయనంచు
బాసలెన్నెనగావించి - వాసిమీర
విటుల ధనమెల్ల గ్రహియించి - వెడలజేయు
చుందురు తుదకు మూడంకె - జూపివీరు.

తే. గీ. హీనుఁడైన; చెవిటివైన - నెంతగుడ్డి
యైన కుష్ఠరోగియయిన - నాత్మయందు
సందియంబును బొందక - సరసుడనుచు
జేరదీతురు ధనముకై - వారసతులు.

కం. జననీజనకులు గడియిం
చిన ఘనకీర్తి సకలము న - శించును బంధుల్
వినినహసింతురు; వారాం
గనపొం దిక వద్దువద్దు - తొమ్మతలమంచున్.

మ. పలురోగంబుల పాలుజేయును; ధనం - బా నాశముంజేయు; బం
ధులచేదిట్టులుదెచ్చు తథ్యముగ దో - స్తోగూర్చువైరంబు స
త్కులకాంతామణితోడ నెప్పుడు; యహో - దూష్యంబునై యొప్పురో.
వెలదిన్ గూడుటకన్న పాపమిక వృ - ద్ధిన్ లేదు సిక్కమ్మగన్.

చం. వలపుజనింపజేసి కడు ꣻ బాసల నెన్నియొనిచ్చి; భార్యపై
దొలఁగఁగ జేసి ప్రేమ; బుధ ꣻ తోషణయంచు నుతించి చిత్తముల్
గలచి; ధనంబుచేఁకొని ꣻ కాలముజూచి తదీయమాతనుల్
వడిఁ బురికొల్పి పొమ్మనుచు ꣻ బల్కెడి వీరలనమ్మవచ్చునే.

మ. కరుణా నాస్తి; కటాక్షమా సభము; సత్కార్యంబులాసున్న సు
స్థిరచిత్తంబుహుళక్కి; వావివరుసల్ ꣻ జెప్పంగ రాదింతయున్
వరరాగఁ బలమక్క కేయెదురుగా ꣻ వర్తించు వేశ్యాంగనల్
ధరణింజెప్పఁగ నొప్పు బూరుమగళ్లో ꣻ ద్బంధంబనా; తప్పకన్.

తే. గీ. కంచుకాగడ, జూచిన ꣻ నంచితముగ
గానిపించదింతైన ని ꣻ ష్కపటబుద్ధి
మాయలును తంత్రిమంత్రిముల్ ꣻ బరఁగుచుండు
కుక్షియందున గడువార ꣻ కోమలులకు.

చం. తనసతి రోయుటొక్కటి; బు ꣻ ధప్రకరంబుల తిట్లురెండు; స
జ్జనులు సతంబుదూష్యమును ꣻ సల్పుటమూడలమోక్షలోకముల్
ఘనముగ జేరకుంటది ꣻ గాంచగనాలుగు; ద్రవ్యమంతయున్
వెనుకయుముందు జూడకను ꣻ బృథ్విసిగల్పుట యైదు రోగముల్
గనుచుశరీరసౌఖ్యమును ꣻ గాంచగయుండుట యారు ప్రాప్తమా
మనమునవించుకంతయును ꣻ మానములేకను వేశ్యగూడినన్.

తే. గీ. ఉంచుకొన్నట్టిముండయు ꣻ బెంచుకొన్న
కొడుకునెప్డూ నెత్తినికొత్త ꣻ గోపమెత్తి
యేగుడు రటన్నమాటలు ꣻ నెఱిగియుండి
మందయాన గూడినఫల ꣻ మందినాడు.

శహాన—ఏకతాళం.

మగు వల నమ్మ రాదు । మంచికి మంచి లేదు ॥ మగు ॥
మొగ మాట ముంచ రాదు । మోహాము సుంత లేదు ॥ మగు ॥
అందని మాని పండ్లు । అందురు జవ రాండ్రు ।
యెందరో కోడె గాండ్రు । యెంచిన మేడి పండ్లు ॥ మగు ॥
చేతిలో చేయి వేసి । చెంతకు జేర దీసి ।
బోదురు యెడ బాసి బుర్రకు మసి బూసి ॥ మగు ॥
పరగెడు శ్రీ ఛత్రి । పుర జగ న్మోహాన ।
సరసకు జేరి మేరి సరగున బోర్చె వారి ॥
మగువల నమ్మరాదు । మంచికి మంచిలేదు ॥

హిందూస్తాని—త్రిపుట.

చాలును చాలును చాలును చాలును వెల
సతీ మణుల పొందు ॥ చాలును ॥
ముం దెంతో బడితిని పోకు ।
యీ కొంపల కెన్నడు రాకు ।
తుద కీటుల గలిగె చీ కాకు ।
రాకూ మరి రాకూ ఇక రాకూ । రాకూ ॥ చాలును ॥

అయ్యో! నామనస్సంతా రాయిఅయిపోయింది. గాభరాగా వుంది. ఏమీ తోచడం లేదు. పున్నదియూవత్తూ తునరం చేసింది. "పైసా లేనివాడు పరస్త్రీ వర్జితుడన్నారు. డబ్బులేని నా మొగంయింకా యెవ్వరుచూస్తారు. పెళ్ళాంబిడ్డలను పోషించడంయెల్లా. సమస్తముఅమ్మి యీముండకు దాచయిస్తేయిల్లాచేసిందే. అయ్యో. ఎనిమిది వేలరూపాయులు. ఎనిమిది వేల రూపాయలు. ఎంతసొమ్ము. ఎంతసొమ్ము.

(గుండెలు గొట్టుకొనుచు నిష్క్రమించును)



రంగము.

[పోలీసు యిన్స్పెక్టరు ముకుందారావుగారు జనాను
ఇబ్రహీంసాహేబు ప్రవేశము.]

ముకుం——ఇబ్రహీం! ఈగోలేమిటి? ఎవళ్ళో చచ్చినారు కామోసు.

ఇబ్ర——హాఁ! మహారాజ్. రెండుమనుషుక్ మీానాక్షికి కూతుళ్లు యిప్పుడు "ఏక్‌దఫా మర్గయా"

ముకుం——ఇద్దరూ! ఒక్కసారే చచ్చిపోయినారా. ఆశ్చర్యంగావుందే వీళ్ళు చచ్చియేమన్తూవుంటే యీసమయంలో దొంగలుదోచుకొనిపోయినారేమిటి!

ఇబ్ర——"దొంగల్ నై గింగల్ నై" వీళ్ళకే "దొంగల్" "పక్కాహురుషుల్" వీళ్ళు అల్లాగుళ్ళో పోయినాయని రిపోర్టువచ్చింది ఆవెండిబిందెల్ గిందెల్ యిక్కడ దొరకుతాయ్ ఈసమయంలో కొంచెం మీారు ఖరఖట్టుగావుంటే మనకి అదృష్టం పండుతాయ్.

ముకుం——సమయంమంచిదే. అక్కడయెవ్వరోనిలుచున్నారు చూడు.

ఇబ్ర——వీరికి తుంమెూ తెలిసింది లేదు. ఈయనాయెంకటేష్ రావుపంతుల్. మోహిన్కివుంచుకొండాడ్. యీమహరాజా!

ముకుం——వెంకటేశ్వర్రావుగారూ. ఈలా దయచేయండి.

వెంక——(గుండెలుగొట్టుకొంటూప్రవేశించి) ఎనిమిదివేలరూపాయలు! ఎనిమిదివేలరూపాయలు!! గుండమైపోయినాయి!!!

ముకుం——అదియేమిటి? ఎనిమిదివేలరూపాయలేమిటి ఆసంగతియేమిటో సరిగా చెప్పవయ్యా!

వెంక——ఎనిమిదివేలు! ఎనిమిదివేలు! నానోట్లో మన్ను గొట్టినారు.

ఇబ్ర——దేఖోసాబ్" దీనికి అర్థం మీాకీతెల్సింది లేదు. ఈతన్కి మోహిన్కి యెనిమిదివేలరూపాయల్ టోపీవేసిందిఅన్న మాట.వీడు

దివాలా అయిపోయినాడు. మరికి యిప్పుడీ చిక్కులన్నీ తె
లుస్తాయి.

ముకుం——సరే లోపలినుంచి మనుష్యులెవ్వరూ అవతలకు వెళ్ళ
కుండా వాకిట మనజవానులున్నారా.

ఇబ్రి——"హై" మహారాజ్.

ముకుం——సరే. మీనాక్షిని యిక్కడకు తీసికొని రా.

ఇబ్రి——అచ్ఛా. (నిష్క్రమించి వెంటనే మీనాక్షితో ప్రవేశము)

మీనా——(ముకుందరావుగారిని చూచి) ఇన్స్పెక్టరుగారూ. దం
డాలండీ.

ముకుం——ఈదండాలకేమిగాని, నీయిద్దరుకూతుళ్లూ ఒకటేసారి చచ్చి
నారేమిటి? ఎవరన్నా విషంగిషం తగిలించినారేమిటి? వాళ్ల
ను డాక్టరుతనిఖచేసి కోస్తేనేగాని తీసికొని వెళ్ళడానికి
వల్లగాదు.

మీనా——చెట్టంతకూతుళ్లూ యిద్దరు చచ్చియేడుస్తూవుంటే నాకీగోల
యేమిటండీ? నాకూతుళ్లకువిషం యెవ్వరుపెట్టుతారండీ.
అయ్యా. మాకుమరింతశోకం యెందుకుకలిగిస్తారు. ఇంకా
కనుక్కోండి మందుయిచ్చేవైద్యుడు కొండయ్యనాయుడుగారు
యిక్కడనేవున్నారు.

ఇబ్రి——ఆవైద్యుడ్కి యీమోహినికీ యిలాఖా. ఆవైద్యుడుగారు
తొక్కని గుమ్మంలేదుసాబ్!

మీనా——రామ! రామ! మోహిని వుంచుకొన్నది వెంకటేశ్వరావు
గారండీ.

ముకుం——వెంకటేశ్వరరావు ఎనిమిదివేలు. ఎనిమిదివేలు. అంటూ
పిచ్చికేకలేస్తాడేమిటి.

మీనా——ఆదేమో బాబూ. ఆసంగతి నాకేమితెలుస్తుంది.

ముకుం—పోనీలే. ఆసంగతి తెలియకపోతే, పూజారి రామానుజాచార్యులు గుళ్లో అభిషేకపువెండిబిందెలు తెచ్చి మీకిచ్చినాడట యేమిటీ.

మీనా—(తనలో) కొంపమునిగిందిరా బాబూ! అన్నీ యిప్పుడే తటస్థించాయి. (ప్రకాశముగా) బాబూ. మాసంగతి మీరు యెఱుకగపోయినా విన్నయినా యుంటారు. మాయింటికి అల్లాటివాళ్ళు రారు. అల్లాటివిస్తే మేము పుచ్చుకోము.

ముకుం—నిజం చెప్పండి. నీవు నిజం చెప్పకపోయినా నిజం చెప్పించగల సామర్థ్యము మావద్దవున్నది.

ఇబ్రా—"బద్మాష్" దీన్ని ష్టేషన్కు లాక్కుపోతాము రండి. (మీనాక్షితో) పదా. ష్టేషన్కు.

మీనా—ఇనస్పెక్టరుగారితో మనవిచేనుకుంటూవుంటే తొందరపడతావెందుకుసాహెబూ

ఇబ్రా—సాహెబు లేదూ గీహెబు లేదు. పద. ష్టేషన్కు.

ముకుం—నీయిల్లిప్పుడు సోదా చెయ్యాలి. సాహెబు. యింట్లోవాళ్ళను యెవ్వరిని అవతలికివెళ్ళకుండా యిల్లంతా సోదా చెయ్యి.

ఇబ్రా—మంచిది మహారాజ్.

మీనా—అయ్యో. యిదేంగోల. (నిష్క్రమించును)

ఇబ్రా }
ముకుం } (నిష్క్రమించును)

[వెంటనే రామానుజాచార్యులు—వీరయ్య చినరాజు శెట్టిమొదలగువారు తొందరగా ప్రవేశింతురు]

రామా—(తనలో) ఇదేంకర్మంరా. నాయినా! ఈసమయములో నేనిక్కడెందుకున్నానురా నాయనా!

వీర—(తనలో) యీమోహినికిచ్చిన వస్తువులు తెమ్మని లోకులునన్ను అడుగుతూవచ్చి యియ్యకపోతే పోలీసుకు రిపోర్టుచేసినారు రాబాబూ. ఏంచెయ్యను.

చిన—(తనలో) ఈయినస్పెక్టరుకు అడిగినప్పుడు సరుకులు వుచితంగా యయ్యనని అసలే కోపంమీదవున్నాడు. ఇప్పుడేంచేస్తాడోకదా.

ఇబ్రి—(ముకుందరావుగారినిజూచి) అయ్యా! ఇనస్పెక్టరుగారూ. దేఖోసాబ్. (రామానుజాచారినిజూపి) ఈడే "బద్మాష్" అల్లాకు నీళ్ళుపోసేబిందెల్ తెచ్చి యీలంజెల్కూ, యిచ్చినాడు. సూస్కోండీ. బిందెల్ దొరికినాయి. వీడికి దిట్టంగాశిచ్చ వేయించాలి. (వీరయ్యనుచూపి) ఏడ్కీసూడండీ. అందరికి నగల్ చేస్తానని తెచ్చి యీముండాకు యిచ్చినాడు. బద్మాష్. (చిన్నరాజు శెట్టినిజూపి) వీడ్కీమీకు తెలిసేదివుందా. మొన్న మీరు నాకీ కుంకంపుప్వుకోసం పంపించార్. షుకారు. అప్పుడు వీడికి అడిగితే సరుకు అయిపోయిందని చెప్పినాడు. పోలీసువారంటే యీడికి "ఖుచ్ ఫికర్ నై" సాబ్.

ముకుం—సరే. వీరిని స్టేషనుకు తీసుకునిరండి.

(నిష్క్రమింతురు)

రంగము.

[మోహినిగది మోహిని, మీనాక్షి, కొండయ్యనాయుడుప్రవేశము]

కొండ—మీనాక్షీ. పూరికే గొంతుక బొంగురుపోయేటట్టు యేడిస్తే యేమిలాభంవుంది. ఆయిద్దరిపిల్లలను కనలేదనుకో. ఆపోలీసు వారు ఇప్పుడు 10000 వేల రూపాయలు ఇస్తేనేగాని రాజీపడ

నన్నారు. ఈసంగతి ఆలోచించు. ఏడవడానికిదిసమయంకాదు.

మీనా——పిల్లలుచచ్చి నేనేడుస్తూంటే వాళ్ళకింతలంచం నేనెక్కడ యియ్యగలనుబాబూ. వాళ్ళిల్లా అడగడం ధర్మమేనా ?

కొండ——వాళ్ళకు ధర్మంతోయేమీపనిలేదు. నీవిల్లాయిస్తేనే మాట దక్కుతుంది, లేదా కొంపమునుగుతుంది. శవాల్ని కొయ్యకుండా డాక్టరుకు కొంతయియ్యవలెను.

మీనా——ఆదిక్కుమాలిన నంబివాడు నాకొంపతీశాడు తత్తుకొడుకును బిందెలెవ్వరు తెచ్చియిమ్మన్నారు.

కొండ——సరే. ఇప్పుడంతాయెందుకు! వాడిస్తే నిన్నుపుచ్చుకోమన్నారాయేమిటి. ఇప్పుడే నిన్నుగూడా కొట్లోవేస్తామన్నారు. కాని నేను నెమ్మదిగామాట్లాడి వ్యవహారం ఫయిసలుచేయిస్తానని చెప్పి జామీనుమీగ నిన్నువిడిపించినాను. మోహిని బాలింతరాలని సర్దించాను. త్వరగాచూడు ఆలస్యమయితే మాట దక్కదు.

మీనా——నన్ను గంగలోదింపినాసరే. చంపివేసినాసరే. అంతకాదు కదా ఒక్కపైసాఅయినా యివ్వలేను.

మోహి——అమ్మా ఇల్లాగంటే యేలాగువ్యవహారాలు చక్కపడుతాయి. నిమూలమున కొంపకెన్నియనర్థకాలు వచ్చినవో చూచితివా. (కొండయ్యనాయుడునుచూచి) నాయుడుగారూ మాఅమ్మతోనేమిటెండి. ఈనావస్తువులు తీసుకొనిపోయి విక్రయించి యీసొమ్మును వారికిచ్చి కేసు మాపుచేయించండి.

(వస్తువులిచ్చును)

కొండ——(పుచ్చుకొని) మోహిని! మీనాక్షి! ఇక్కడకు అవవలసినదంతయు అయినది. నేను రెండుముక్కలు మీతో చెప్పదలచుకొన్నాను. మీకు కోపంవస్తుందని తెలిసియుండీ సాహసముపూని

చెప్పుచున్నాను. బాల్యంబాదిగా మీరు పశుపువృత్తిచే ఎం తోధనమునార్జించినారుకాని అనేకసారు లిట్లాకేనులకే తగుల పెట్టినారు. రాత్రిమట్టుకు రాత్రి మీయింట్లో జరిగినకన్నం విషయమై లోకులేమని చెప్పుకొనుచున్నారో వింటిరా మీ యింట ప్రవేశించిన వెంకటేశ్వరాప్రవు త సర్వస్వము మీకి చ్చి తుదకు పిచ్చివాడైపోయినాడు. వీరయ్య రామానుజాచా ర్యులు ఖైదుచబడినారు. ఎవడూ బాగుపడలేదు. ఇంకమీసం గతి చూతామంటే సుఖరోగములచే యిద్దరుకూతుళ్ళు చచ్చి నారు. మీయిళ్ళల్లో జరిగేద్రోహములు వర్ణింపతరముగాదు. మీహడావడిచూచి మీవాళ్ళందరూ తండ్రీ! దేవుడా. ఈప శుపువృత్తివద్దు. పెళ్ళిచేసుకుంటే బాగుంటుందని అనుకుంటు న్నారు. కాబట్టి పెద్దవారు మీరేలాగూ చెడినారు. మీపిల్లల నుకూడా చెడుపక చక్కగా పెళ్ళిచేసి వన్నెకెక్కండి. ఇంక నేనువెళ్ళి మీ కేసువిషయమై పోలీసువాళ్ళనోళ్ళు కట్టివస్తాను.

(నిష్క్రమించును)

మోహి—అమ్మా. విన్నావుగదా. ఈయనమాటలు. ఈయన వేశ్యా లోలుడైనప్పటికీ బుద్ధివచ్చి యిట్లు చెప్పినాడు. ఛీ, జన్మజన్మా నికి యీవ్యభిచారవృత్తి వద్దు. పద. పద.

(నిష్క్రమింతురు)

రంగము.

[మోహిని, మీనాక్షి, చంద్రరేక ప్రవేశము.]

మీనా—అమ్మాయీ. ఈవాళ మనయింటికి మామూలుగా పంచాం గం చెప్పడానికివచ్చే బ్రాహ్మణాయన రాలేదెందుచేతనోకదా.

మోహి—కారణము మనకేం తెలుస్తుంది. ఆయనతో మనకేమియువ సరమున్నది.

HYDERABAD 1923

మీనా—ఏముంది. నీకూతురికిగజ్జలపూజచేయించడానికి ముహూర్తం నిశ్చయించేనిమిత్తం.

మోహి—చాలు, చాలు, మనమరాలికి గజ్జలపూజచేయించి ఆట పాటలునేర్పించి వ్యభిచారవృత్తిలో దింపుదామనా యేమిటి వుద్దేశం.

మీనా—మీఅందరినీ ఎల్లాచేశానో దీన్ని ఆలాగేచేస్తాను.

మోహి—అమ్మా. చాలు. చాలు. వ్యభిచారవృత్తికి సహస్రివేలదండాలు. నాకూతురిని ఆవృత్తిలోమాత్రము దింపను. అందుకు నామనస్సు ఒప్పుకోదు.

మీనా—అల్లాగయితే నీకూతుర్ని ఏమిచేస్తావు.

మోహి—చక్కగా వివాహముచేసి కులస్త్రీనిచేస్తాను. ఈపిల్ల యెప్పుడయితేపుట్టిందో అప్పుడే యీలాచేయుడానికి మనస్సులో నిశ్చయించుకున్నాను. హరిహర బ్రహ్మాదు లడ్డొచ్చినా యీ ప్రతిజ్ఞ తప్పను.

మీనా ఓహో! ఇంకనీకూతురు సావిత్రియై చంద్రమతీ ద్రౌపదుల వలె మహాకీర్తి పొందుతుందికాబోలు.

మోహి—అంతభాగ్యరేఖ దానినొసటనువుంటే అందుకు సందియమేముంటుంది. అమ్మా. వివాహమాడి పతులం గలసిమెలసి సుఖింపుచు పతివ్రతలైన కులకాంతలనుగూర్చి యెల్లా చెప్పుకొనుచున్నారో, వ్యభిచారవృత్తినిబూని తిరుగుచున్న మనవాళ్ళనుగూర్చి యెల్లాచెప్పుకొనుచున్నారో నీవెఱుగవా. మనము మాత్రము పెళ్ళిచేసికొని కులస్త్రీలవలె వుండకూడదని యేధర్మశాస్త్రిలలోనైనా వుందా యేమిటి?

మీనా—అమ్మాయీ! నీమిట్టవేదాంతాలకు నేనేమనిజవాబు చెప్పను? కులవృత్తికిసాటిలేదని పెద్దలుచెప్పినారు. కాబట్టి యిదిమనకు

పూర్వమునుండి వస్తూవున్న వృత్తిగాని మధ్యయేర్పడినదిగాదు. అనేకమంది అనేకవృత్తులను గల్పించుకొని జీవనంచేస్తున్నారు. కొందరు వుద్యోగాలుచేస్తూవున్నారు. కొందరు వడ్రింగం చేస్తున్నారు. కొందరు చాకలిపనిచేస్తున్నారు. అల్లాగే యిది మనముచేస్తున్నాము. ఇందులో దప్పేమివుంది.

మోహి—ఇతరవృత్తులకున్నూ, మనవృత్తికిన్నీ సాటిచెప్పుతున్నావా? వారివారివృత్తులు న్యాయమైనవిన్ని, లోకులు మెచ్చుకొనదగినవిన్ని ఒకరికి హానిచేయనివియునై యున్నవి. మనసంగతిచూస్తే మంటే మనవృత్తి మనలను పాడుచేయడమేగాక, యితరులను గూడ సన్యాసులనుచేయుచున్నది. తల్లీ! నీవెన్నిమాయపన్నాగాలు పన్నినాసరే నాపిల్లకు నేను పెళ్ళియేచేసితీరుతాను.

మీనా—వినాశకాలానికి విపరీతబుద్ధులు పుడతాయి. ఏమో మహాయెఱిగినదానిమో స్తరుగా తరతరాలునుండీవచ్చే మనవృత్తి నిదూషించే బ్రహ్మాండనాయకురాలవు బయలుదేరినావు.

మోహి—నీవు వూరికే కోపపడకు, మనకులవృత్తి కడునీచమని నీచేతనే ఒప్పిస్తాను. చూడు.

సీ. వైవాహికమువాని వ్యభిచారమును బూని
ధర్మమార్గమువీడి తనరుచుంట
పశువర్తనముదాల్చి వాడుపీడనకను
కుంటిగుడ్డియయినఁ గూడుచుండ
ద్రవ్యమిచ్చినవాని ధవుడంచునుతియించి
పరమముదంబుతో పరిబఁబుచుంట
విత్తమార్జింపఁగా వివిధమాయలఁబన్ని
విటులచిత్తములాగి వెలయుచుంట



తే. గీ. దలపగా పాపములుకావ; | ధర్మము
యిద్ది కులవృత్తియానెకో | యెట్టిమ
మదముచేతను దీనిని | మనమె తెచ్చి
పెట్టికొంటిమి వేయేల | పృథ్వియందు.

తే. గీ. ఆడుబడుచుల గన్నట్టి | యతివలెల్ల
మంచిబుద్ధులనెన్నొ బో | ధించుచుండ
మనము నేర్పుచునున్నాము | మనసుతలకు
విటులచిత్తంబులఁ గలంచి | విత్తమెంతొ
వర్జనముసేయునట్టి మా | యలను దల్లి.

మనపుత్రికలను మనమే చేతులార పాడుజేసుకొనుచున్నారము సాధారణముగా స్త్రీలకుండవలసిన ముఖ్యాలంకారంబగులజ్జనుమనము విడిచివేసి దిక్కుమాలిన ద్రవ్యంబునకై విధివిరామములేక కుంటియనక కుష్ఠురోగియనక యెట్టినీచుడు కనిపించినా మనశరీరంబు వానిచే బెట్టుచున్నాము. (ఇంచుక యూరకుండి) అమ్మా! ఒక్కసారి కన్ను మూసికొని దీర్ఘాలోచనము జేసిచూడు ఈవృత్తి కడునీచమైనదని నీకే తోచును. ప్రపంచకమున నితరకులములలో దమపుత్రికలకు వివాహము జేసి కన్యాదానఫలమునందుచుండగా మనము మనబిడ్డలను కనపడ్డవారికల్లా అప్పగించి, పాపమంతయు బోగుచేసుకొనుచున్నాము.

సీ. వెలయింత సేయని | విటుల పెదవియూట
నధరామృతముగాను | మదిదలంచి
సుఖరోగముల చేత | శోకించు సరసుల
యవివేకభూషణ | హారికధయని
మెఱుపుదీగెనుబోలు | మేలైనజవ్వనం
బు స్థిరమటంచును | బొంగుచుండి

పెండ్లిసేయుటమాని బిడ్డలదేహంబు
గుత్తకై విటులకు గూర్చుచుండి
తే. గీ. వరలుచున్నాము తల్లిరో ధరణియందు
యిద్ది మావృత్తి దీని ని వెంతొగొప్ప
జేసి వచియింపుచున్నావు వాసివీడి
పెద్ద లెవ్వరు దీనిని మెచ్చరిలను.

ఇంకొకటిచూడు. సాధారణముగా మనవారికి సంతానముగలుగుచుండుట లేదు. ఇందుకుగారణము మాగర్భంబుననున్న రోగము లే అందుచేత యేదో బీదకుటుంబములో పుట్టినపిల్లను వెలకుదెచ్చుకొని వాళ్ళ కాటపాటలుచెప్పించి వ్యభిచారవృత్తినిదింపి గొంతుకలు గోయుచున్నాము. ఇదియట్లుండనిమ్ము. సంసారముచేయుచున్న కాంతలు వ్యభిచారముచేసిరనిగాని లేక పరపురుషులతో మాట్లాడుచుండగా జూచినగాని వారిపురుషులెంతోకోపంబుబూనుదురు. మనవారిలో అన్నదమ్ములే మనకు విటులను దార్చుటకనుకూలపడుచున్నారు. ఛీ! ఇది ఎంత హేయమైనది. అమ్మా భర్తనుకట్టుకొని, పాతివ్రత్యమునుబూని యశమందుట మంచిదిగాని యిట్టివ్యభిచారవృత్తినిబూనిశరీరమంతయు బాడుచేసుకొని, తుదకు నూరుపేరులేకుండ జచ్చుటమంచిదని తలంపకుము. జన్మజన్మంబులకు నిట్టివృత్తి ప్రసాదింపవద్దని భగవంతుని వేడికొందము. నీవువ్యభిచారము మనకులవృత్తియనిపలుకుచున్నావు. ఇది మనము తెచ్చిపెట్టుకొన్నదిగాని, కులవృత్తిగాదు. గాంధర్వవిద్యయేకులవృత్తి. దానిని సాకుజేసికొని యిందులోకిదిగినాము. సభయందుసర్వావయవములు చూపుచు నాట్యముసల్పునప్పుడు పదిమందియుమనలను జూచి నవ్వుట యెంత హేయము! మనకెంతతలవంపు! మనకడుపున కొడుకులపుట్టితే, వారిని లోకులుచూచి మీతండ్రిపేరెవ్వరని అడిగితే యేమిచెప్పాలేమిటి? వుంచుకున్నవాళ్ళపేర్లు చెప్పవలెనా? ఇంక

మనమొగవాళ్ళసంగతిఅడగనక్కరలేదు.ఏమీరాక పాటలులేక 'కుయ్, కుయ్' అను ఫీడేల్లు వాయించుకోవడం, మనకు విటులను తార్చడం. ఇది గొప్పవుద్యోగం. వీళ్ళకు నానాటికి తాగుడు, జూదము యెక్కువయై పశువులవలె చరించుచున్నారు. ఎంతవరకు దీర్ఘాలోచనముచేసి చూచినను, మనలను దూషించనివారులేరు. కావున నీవెన్ని చెప్పినను సరే నాకూతురగు యీచంద్రరేఖనుమాత్రము సానిగాచేయను. సి వింత ముసలిదానవైనను వ్యభిచారమందు అభిరుచి తగ్గలేదుగదా.

మీనా—అమ్మాయీ! నీవు వేదాంతము బాగానేర్చినావే. ఇది అంతా ఎవరు నేర్పినారు?

మోహి—ఇట్టిది ఒకరునేర్పనక్కరలేదు. అనుభవాన్నిపట్టి గ్రహింపవచ్చును. నీకుమాత్ర మనుభవములేదా!

మీనా—అట్లయితే అనాదిగవచ్చుచున్న యీమనవృత్తి నీచమని యెట్లు సిద్ధాంతపఱుస్తావు.

మోహి—పశుధర్మమనుసరించి యిష్టమైనవారితో గలియుచుండుట నీచముగాదా.

మీనా—బాగుంది. ద్రౌపదికి అయిదుగురు మొగుళ్లట. కుంతి పెళ్లిగాకమునుపే సూర్యునితో పోయిందట. ఇది మంచిపని కామోసు.

మోహి—అమ్మా! నీవు పుక్కిటిపురాణాలనునమ్మి అడుగుతున్నావా! అట్లయినచో వారు భగవంతునివరములచే నట్లుగావించినారు. వారు పవిత్రురాండ్రుగా నెన్నబడుచున్నారు.

మీనా—ఏమాటడిగితే దానికి సమాధానంచెప్పడం బాగానేర్చుకున్నావు. "పరోపకారార్థ మిదంశరీరం" అన్నారు. మనము లోకులకు వుపకారంచేస్తున్నాము. అట్టి మనవృత్తిని నీచంగా బరిగణిస్తావు.

మోహి—ఇదా మనము లోకానికిచేసేవుపకారం. చాలుచాలు. మన మూలాన్ని సరసులెంత జాడ్యగ్రస్తులై చచ్చుచున్నారు! ఒక నాటిసుఖం ఆరునెలలమంచం! అన్న సామ్యము నీవెఱుగవా యేమిటి ?

మీనా—సరేగాని, మనము యితరులపిల్లలను కొనితెచ్చుకొంటున్నా మన్నావే. ఇతరకులములలోమాత్రము బిడ్డలులేకపోతే తెచ్చి పెంచుకోవడంలేదూ !

మోహి—ఎంతచక్కనిప్రశ్న అడిగినావు. వాళ్ళు తమవంశాన్ని నిలవ బెట్టుకోడానికిన్ని యిన్ని నీళ్ళుచుక్కలు పోయడానికిన్ని పెంచు కొనుచున్నారుగాని, మనమో స్తరుగా వ్యభిచారవృత్తిలో దిం పుటకుగాని లేక మనవాళ్లయితే తార్పుగాండ్రిగా జేయుటకు గాని పెంచుకోవడంలేదు.

మీనా—మనయింట్లోమగవాళ్ళే మనకు తార్పుగాండ్రింటివే. ఇతరుల లోమాత్రము వాళ్ళవాళ్ళ అన్నదమ్ములు మాత్రము వాళ్ళ మొగుళ్లకు అప్పగించడంలేదు.

మోహి—నీప్రశ్న తగలడ్డట్లేవుంది. తక్కినజాతులలో నన్నదమ్ములు తమచెల్లెండ్రనుగాని యితరులనుగాని తీసికొనివెళ్ళి వాళ్లమగ ళ్ళకు అప్పగిస్తారు. మనవాళ్ళు రంకుమగళ్ళకు అప్పగిస్తారు. ఇదంతా పాపంకాదా !

మీనా—మనకెక్కడిపాపమే. మనమెన్నివ్రతాలుచేస్తాము. ఏమి కమామీషు,

మోహి—మనంచేసేవాటిసంగతి చెప్పితే పాపంవస్తుంది.

తే. గీ. భారసాల యటంచును * వ్రతములంచు
విటులయొద్ద ధనములాగి * వేడ్కమీఱి

గడుపునకె తినుచున్నాము ॽ గాంచలేదె
పుణ్య మెటువచ్చు మనకును ॽ బుడమియందు.

మీనా.—

తే. గీ. పసుపు మననొప్టనే ధాత ॽ వ్రాసెనంచుఁ
దలపుచుంటివిగాని యో ॽ లలనమిన్న
కొన్నియిండ్ల వితంతువుల్ ॽ కూళలగుచు
చెడి తిరుగుచుంట నీవు వీ ॽ క్షింపలేదె.

మోహి.—అందుకనే సంఘసంస్కర్తలు వెధవపెళ్ళిళ్ళు పెట్టినారు. మనలోగూడా అవిచేయించడానికి ప్రయత్నం చేస్తున్నారు. అందుకనే బోగంవాళ్లను మేళాలకు పిలువకూడదంటున్నారు. మనమేళాలు చాలాభాగం తగ్గిపోయినవి. ఎక్కడనో కొందరు వైశ్యశిఖామణులుమాత్రము, వేలంవెఱ్ఱియెత్తి మనపాట అభినయంచూచి పిచ్చచూపుచూస్తూవుండడం పల్లకిలించడం తప్ప సంస్కర్తలెవ్వరునూ మనలను పిలువడంలేదు.

మీనా.—అమ్మాయీ!

తే. గీ. ఏలకులవృత్తి నింతగా ॽ నిట్లు దూష
ణంబుజేసెదో యిద్ది పూ ॽ ర్వంబునుండి
లేదె యిప్పుడేవచ్చెనా ॽ లేమ వినుము
చాలుఁజాలును నీతిర ॽ స్కారమికను.

మోహి.—అమ్మా! ఇదికులవృత్తిగాదని యిదివరకే నీతో చెప్పినాను పూర్వము వివాహము చేసుకొన్నట్లే యెవరు కన్నెఱికంచేస్తే వారితో వుండడం, దేవస్తలములలోనున్నూ రాజసభలందూ మేళతాళాలుచేయడం. ఇప్పుడా! చెప్పనక్కరలేదు. కనపడ్డవారిమీదల్లా భల్లూకంపడినట్లు పడడమే.

మీనా.—అమ్మాయీ! రాజాధిరాజులంతటివారుగూడా మనసౌంద ర్యానికిలోనై సేవలుకూడాచేస్తారే, మనకెంతమర్యాద. ఇల్లాటి వృత్తిని దూషిస్తావు.

మోహి.—అమ్మా! నీవు వెఱ్ఱిలోపడిపోయినావు.

తే. గీ. ఆలకింపుమా; యింబట్టు కై హస్తమంచు
గొలుగుటకునయి యెంతెంతో కై గొప్పవారి
తలలు జిక్కుకొనుటలేదె కై ధరణియందు
దాన గొప్పవాడయ్యెనా కై తల్లి వాడు.

మనగౌరవమున్నా అట్టిదే. అమ్మా. నేనొక్కటిచెప్పెదను వినుము. మనమూలంబున లోకంబునయెందరో పురుషులు పాడగుచున్నారు. ఇందుకుగారణము మనవ్యభిచారవృత్తియే ఏమంటే వయస్సువచ్చినవారు మనలను జూచినంతనే మనయొారచూపులకును మనహాంసనడకలకును, మేళతాళాల్లోకి మనంవెళ్ళి పాడేపాటలకును, వశులై నెమ్మదిగామనయిల్లు జేరియెవ్వరికి తెలియకుండ, యేదోయిచ్చి పనిగడుపుకొంటురు. వారియుద్దేశం లోకులు వారు మనయింటికి రావడంలేదని అనుకుంటున్నారనే తలంచుచుంటూవుంటారు. నెమ్మదిగా అదిపాతపడిపోతుంది, అల్లరిఅవుతుంది. వాళ్ళు మనలను వదలరు. తమకున్న ఆస్తి అంతయు గుల్లయి, మనము వెళ్లమని చెప్పేదాకా వెళ్ళరు. ఆఖరుకు తిరుకుపవరంచేసుకొని వళ్ళుగుల్లా యిల్లుగుల్లా అయిపోతారు. లోకులు వాళ్ళనుచూచి మనలను తెగతిట్టుతారు. ఇదిఅంతయు మనవ్యభిచారం మూలముననే. ఇంకొకటిచూడు. మనము దారివెంటవెళ్ళుతుంటే యెంతోమంది మనలనుచూచి ఎన్నో వెధవపేర్లుపెట్టిపిలుస్తుంటారు. చూడు గున్నయ్యశెట్టిగారు వుంచుకొన్న సూర్యనారాయణను కళావరురాణీ అనినీన్ని, అన్ని వుడిగినతరువాత లంజ పతివ్రతయైనదన్నట్లు వేదాంతం

చెప్పుతూ మహా ఆచారంగావుంటానని పలుకుతూ,లజ్జవిడిచివేసి గొడుగువేసుకొనిషికార్లుతిరిగేనర్సికి, డాక్టరు రామభీమేశ్వరుడనిన్నీ, నరసింహానికి గ్యాసులైటనిన్నీ, చిలకసానికి మహిషాసురమర్దనియనిన్నీ, అనేకవిధాలయిన పేర్లు పెట్టినారు.

మీనా.——ఇవన్నీ మనకు బిరుదునామాలు. మర్యాదచేయడానికి అల్లా పిలుస్తుంటారు. కాలాన్ని పట్టి పేర్లు మారుతుంటాయి. ఎల్లిని ఎల్లమ్మఅనాలి, పుల్లిని పుల్లమ్మఅనాలి, జోగిని, జోగారావుగారనాలి.

మోహి.——చాలుచాలు. ఇల్లాటిపేర్లు పెట్టిపిలిచేటప్పుడు చచ్చినచావవుతుంది. వ్యభిచారవృత్తిలో డబ్బుసంపాదించిన మనవాళ్ళల్లో యెవరుబాగుపడ్డారు. నీకన్నీ తెలిసినసంగతులే. రాముడినికళ్యాణిని నీవెఱుగుదువుకదా. వాళ్ళు గొప్పగొప్పవాళ్లఅండలుసంపాయించి మొంతడబ్బుగడించారు. ఏమన్నాలాభంవుందా. చినరాజన్న శెట్టిగారు నెమ్మదిగా వాళ్ళనుఅతుక్కొని, అదియిస్తానిదియిస్తాననిఆసలుపుట్టించిచేతికిచిప్పవచ్చేటట్టుచేసి కూర్చుండపెట్టి కళ్యాణికితిరుపతిమంగలికుప్పరంచేశాడు. రాముడిసంగతికూడా తక్కిందిపూర్తియగుతుంది. జగన్మోహిని గడించినడబ్బుకు మితివుందా. ఎవ్వడో జమీందారునని పేరుపెట్టుకొనివచ్చి ఇరవైరూపాయలుయిచ్చి రాత్రివెళ్ళి అర్ధరాత్రి దానివంటిమీదనగలన్నీ వల్చుకొనివెళ్ళినాడు. ఆళికుంతల కొండలరావుపంతులు పొలము యిల్లుఅమ్మించి, ఆయన్ని బుక్కాపకీరుగాజేసి, సంపాదించిన డబ్బంతా యీమధ్య దాన్ని అతుక్కొన్న సుదర్శనుడు తువరంచేశాడుగదా. చెప్పతలచుకొంటే యిల్లాటివి చాలావున్నవి. ఇవంతాయెందుకు. మనసంగతిచూడు. మొన్నమన దగ్గిర వెంకటేశ్వరరావు దాచుకొన్నరూపాయలు మనముఅప

వారిస్తే మనకుదక్కిందా మనము పోలీసువారికి పోతాము. ఇల్లావచ్చినధనము యెప్పుడూదక్కదు. ఎల్లావచ్చింది అల్లాగే పోతుంది. ఈమాటలవలనప్రయోజనమేమీలేదు. నీకుఅనుభవమే కాబట్టి నాకూతురికి నేను పెళ్ళిచేస్తాను. ఇందుకు నీవు సంతోషించు.

మీనా.—అమ్మాయీ! నీవుచెప్పినమాట బాగానేయున్నది. వ్యభిచారవృత్తివలన లాభంలేదని నాకిప్పుడు తెలిసింది. కాని మనం ఎక్కువగా ద్రవ్యంసంపాయించడం యేలాగు అని సందియం కలుగుతుంది. ఈవృత్తిలో డబ్బుబాగా దొరుకుతుందే.

మోహి.—అమ్మా నీవింక సందేహాలుమాను. మంచివృత్తు లనేకములున్నాయి.

ఉ. మోదముతోడ నెల్లరును । భూతలమందున మెచ్చునట్లు మ
ర్యాదగనుండి ద్రవ్యమును । నార్జనసేయగ నొప్పుగాక; క
వ్యాదులరీతి బూరుషుల । వంచనఁజేసిన లాభమున్నె పా
కీదిగడింపదే ధనము । కీర్తికిరాని ధనంబుగాల్పనే.

క. మనపుత్రీరత్నములకు
ఘనముగ వైవాహికంబు । గావించినచో
మనలను నాతడు ముదమున
జనులెల్లను మెచ్చునట్లు । సాకడె చెపుమా.

మీనా.—అమ్మాయీ! మనమొక్కళ్ళమూ యిదిచేస్తే అంతాచెయ్యవద్దు.

మోహి.—అమ్మా! మనము దారివేశ్యామంటే బాగావుందని అంతా ఖూఁదా శేతొక్కుతారు. చూడలేదా మొన్ననుపోతయ్యగారి

అప్పుడు కూతురు కళావతికి పెళ్లి చేయడం చూచి యెందరు పెండ్లిండ్లు చేయనిశ్చయించు కొనుచున్నారో. అల్లాఅయితే నేసంఘము వృద్ధిఅవుతుంది.

మీనా.—అమ్మాయీ! నీవుచెప్పినమాటలు నాకీనీచవృత్తిమీదరోత పుట్టించివేశాయి. చక్కగా మనపిల్లను శ్రీధరుడికిచ్చి పెళ్లి చేద్దాము. వాడు బాగా చదువుకుంటున్నాడు.

మోహి.—అమ్మా మంచిది. మనపిల్లగూడా అతనిమీద అనురాగంగావుంది. భగవంతుడిందుకు తగినసాయంచేస్తాడు. ఇంక ముహూర్తం పెట్టిద్దాము.

సీ. సంతానమదిలేక ^ చింతనొందుచుజాల
వీరివారిసుతల ^ బెంచుకొనుచు

నాటపాటలనేర్పి ^ నీటుగోటులజూపి
విటులమదిగలంచి ^ వెలయునట్టి

మార్గంబుబోధించి ^ పడుపువృత్తికిదింపి
లోకులనుగడుచీ ^ కాకుపఱచి

కడకునార్జించిన ^ ఘనభాగ్యమంతయు
నేలపాల్గావించి ^ నిఖిలజనులు

తే. గీ. మిగుల పరిహాసమాడగా ^ బృథ్వియందు
గాలమును వెళ్ళదీయగా ^ గాంతుమేల
బిడ్డలకు బెండ్లిగావించి ^ విమలయశము
తద్దయునునందుడీ వేశ్య ^ తల్లులార.

(నిష్క్రమించుచున్నారు)

## మంగళహారతి.

సారహారతీ - గైకోవె - శ్రీపతి
ధీ - ర - నందకు - మార - దనుజవి-దా - ర - సువిచార॥ సార
గోపికా - లోలా - సందీపితసు - శీలా
పా - ప - హరయదుదీ - ప - గతసంతా - ప - సుకపాలా॥ సా॥
పక్షిరాడ్గమనా - సురపక్షారిపుదమనా
రక్ష-కమలదళా-క్ష-దనుజవిప-క్షా-శ్రీవ-క్షా॥ సార॥

వేశ్యామధురము మొదటిభాగము

సంపూర్ణము.




SREE VEMANA ANDHRA BHASHA NILAYAM
HYDERABAD-DN.